# గృహలక్ష్మి





# GRIHALAKSHMI

15th FEBRUARY 1958

Vol.27 No. 2

40 nP.


చేనేత సప్తాహ సంచిక




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4-50. న.పై. అర్ధసంవత్సరపు చందా రు. 2-25. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి 40 న.పై. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులు లేక వ్రాయవలెను. భాష గ్రాంథికము గాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితలకట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం ప్రైవేట్ లిమిటెడ్' పేర పంపవలెను.

---

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.









దేశమంతటా అల్లిబిల్లిగా అల్లుకు పోయిన అనేకానేక కుటీర పరిశ్రమ కేంద్రాల కృషి – భారతీయ చేనేత కళాకారులచే సంప్రదాయ, ఆధునిక రీతులలో నూతన సృష్టి –

తరతరాల కళావిశిష్టత మనకందిస్తూ, అందానికీ, మన్నికకూ అద్వితీయమని పేరందినవి –

మీరు కొనే ప్రతి గజమూ వారి అసామాన్య ప్రతిభకు మీ మెప్పును సూచిస్తుంది –

## చేనేత వస్త్రాలు

ఎప్పటిలాగే ఇప్పుడు కూడా మీగృహాల అలంకరణకు–మీదుస్తులకు–

అఖిల భారత

# చేనేత సప్తాహం

1958 సం. ఫిబ్రవరి 8 నుండి 15 వ తేదీ వరకు









DA-57/308

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములను
పెంపొందించుటకు యేర్పడిన
పవిత్ర మాసపత్రిక

ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. వున్నయ్య

సంపుటము ౨౭ ]  ఫిబ్రవరి 1958  [ సంచిక ౨



# విషయసూచిక



ముఖచిత్రం : శిల్పి - శ్రీమతి యం. వి. యస్. కృపావతి



—o—




జయజయ గృహలక్ష్మి సఖీ! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

---

## చే నే త స ప్తా హ ము

ఈ నెల 8-వ తేది నుండి 15-వ తేదీ వరకు జరుగుచున్న అఖిలభారత చేనేత సప్తాహము ప్రజలలో చేనేత ఉత్పత్తులపట్ల ఆసక్తి, ఆదరాభిమానములను పెంపుచేసి పరిశ్రమకు ప్రకాశవంతమైన భవిష్యత్తును సమకూర్చాలని ఆశిద్దాం!

ఈనాటికికూడ మనసంఘంలో చీరలు, రవికలు, ధోవతులు, ఉత్తరీయాల లాంటి రకాలకు చేనేత గుడ్డకుగల మన్నిక, అభిమానము మిల్లు గుడ్డకు లేదు. చేనేత ధారణ సమకూర్చు సుఖమును, తృప్తిని మిల్లు గుడ్డ సమకూర్చలేదని గట్టిగా చెప్పనగును. ఈనాడు నాణ్యమునకు, గట్టితనమునకు, చేనేతరకాలు ఏమాత్రము తీసిపోవుటలేదు.

స్త్రీలు ముఖ్యంగా విదేశవస్త్రాలమీద, మిల్లుగుడ్డల మీద వ్యామోహం మాని తమ అవసరాలకు, తమ కుటుంబావసరాలకు చేనేత గుడ్డ వాడకమునకు ఆసక్తి



ఈనాడు నాణ్యమునకు, గట్టితనమునకు, చేనేతరకాలు ఏమాత్రము తీసిపోవుటలేదు.
స్త్రీలు ముఖ్యంగా విదేశవస్త్రాలమీద, మిల్లుగుడ్డల మీద వ్యామోహం మాని తమ అవసరాలకు, తమ కుటుంబావసరాలకు చేనేత గుడ్డ వాడకమునకు ఆసక్తి
57
ఈనాడు నాణ్యమునకు, గట్టితనమునకు, చేనేతరకాలు ఏమాత్రము తీసిపోవుటలేదు.
స్త్రీలు ముఖ్యంగా విదేశవస్త్రాలమీద, మిల్లుగుడ్డల మీద వ్యామోహం మాని తమ అవసరాలకు, తమ కుటుంబావసరాలకు చేనేత గుడ్డ వాడకమునకు ఆసక్తి
57
ఈనాడు నాణ్యమునకు, గట్టితనమునకు, చేనేతరకాలు ఏమాత్రము తీసిపోవుటలేదు.
స్త్రీలు ముఖ్యంగా విదేశవస్త్రాలమీద, మిల్లుగుడ్డల మీద వ్యామోహం మాని తమ అవసరాలకు, తమ కుటుంబావసరాలకు చేనేత గుడ్డ వాడకమునకు ఆసక్తి
57
ఈనాడు నాణ్యమునకు, గట్టితనమునకు, చేనేతరకాలు ఏమాత్రము తీసిపోవుటలేదు.
స్త్రీలు ముఖ్యంగా విదేశవస్త్రాలమీద, మిల్లుగుడ్డల మీద వ్యామోహం మాని తమ అవసరాలకు, తమ కుటుంబావసరాలకు చేనేత గుడ్డ వాడకమునకు ఆసక్తి
57
ఈనాడు నాణ్యమునకు, గట్టితనమునకు, చేనేతరకాలు ఏమాత్రము తీసిపోవుటలేదు.
స్త్రీలు ముఖ్యంగా విదేశవస్త్రాలమీద, మిల్లుగుడ్డల మీద వ్యామోహం మాని తమ అవసరాలకు, తమ కుటుంబావసరాలకు చేనేత గుడ్డ వాడకమునకు ఆసక్తి
57
ఈనాడు నాణ్యమునకు, గట్టితనమునకు, చేనేతరకాలు ఏమాత్రము తీసిపోవుటలేదు.
స్త్రీలు ముఖ్యంగా విదేశవస్త్రాలమీద, మిల్లుగుడ్డల మీద వ్యామోహం మాని తమ అవసరాలకు, తమ కుటుంబావసరాలకు చేనేత గుడ్డ వాడకమునకు ఆసక్తి
57
ఈనాడు నాణ్యమునకు, గట్టితనమునకు, చేనేతరకాలు ఏమాత్రము తీసిపోవుటలేదు.

చూపినచో పరిశ్రమాభివృద్ధి సుగమమగుటయేకాక జాతీయాభ్యుదయానికి ఆయువు పట్టయిన గ్రామీణ ఆర్థికవ్యవస్థను పదిలంచేసిన వారగుదురు.

చేనేత పరిశ్రమ దేశంమొత్తంమీద లక్షలకొలది గ్రామీణులకు జీవనోపాధిని కల్పించుచున్నది. చేనేతపరిశ్రమ అభివృద్ధిగాంచుటవలన జాతీయ సంపద పెరుగ గలదు. అనేక వేల కుటుంబాలు నిత్యావసరాలతో సౌభాగ్యవంతముగా రూపొంద గలవు. చేనేత వస్త్రాలు మిల్లువస్త్రాలకంటె ధరవరలలో కొంచము అధికమయినా జాతీయశ్రేయస్సు నుద్దేశించి చేనేతవస్త్రాలను ప్రతియొక్కరు వాడవలసియున్నది.

పారిశ్రామికులు సయితం తమకుగల అవకాశములను సద్వినియోగం చేసికొని ఉత్పత్తులను నాణ్యంగాను, మేలైనరకాలలో రూపొందించుటకు ఆసక్తి చూపాలి.

చేనేత గుడ్డ వాడకం పెరిగి, దాంతో ఉత్పత్తులు పెరిగినచో క్రమంగా ధరలు సయితం తగ్గవచ్చును.

మిల్లుగుడ్డలతో ధరలలో పోటీకి చేనేతగుడ్డ నిలువ కలుగుటకు, విదేశాలలో మన్ననలకు పాత్రమగుచున్న చేనేత వస్త్రాలకు మార్కెటును చూపి ఎగుమతి వసతులను విస్తృతముచేయుటకు ప్రభుత్వము పూనుకొనుటవలన చేనేతపరిశ్రమకు మరింత రక్షణతోబాటు అభివృద్ధికి అవకాశములు విస్తారమగును.

---

## కేసరి విద్యాలయముల వార్షికోత్సవము

O—X—O

ఎప్పటియట్లు యీ నెల 5-వ తేదిన కేసరి విద్యాలయముల వార్షికోత్సవము లోకసభ స్పీకర్ శ్రీ ఎం. అనంతశయనం అయ్యంగారి అధ్యక్షతన జరిగినసందర్భ మున విద్యార్థులలోను ఉత్సవంలోపాల్గొనిన తల్లిదండ్రులలోను పురప్రముఖులలోను వెల్లివిరిసిన ఆనందోత్సాహాలు కనులపండుగగా నుండినది.

ఈ సందర్భమున కేసరి విద్యాలయముల అభివృద్ధికి, ఆర్థికస్థిమితమును పెంపు జేయుటకు నిర్విరామంగా కృషిసల్పుతున్న కేసరి విద్యా సంఘ కార్యదర్శి దివాన్ బహాదూరు బండి శ్రీహరిరావు నాయుడుగారు అభినందనీయులు.

కార్యదర్శిగారి వార్షికనివేదిక, విజ్ఞప్తి కేసరి విద్యాలయముల అభివృద్ధికి తెలుగు ప్రజల సహకారములత్యవసరమని సూచిస్తున్నవి. మద్రాసులోని ఆయా ప్రాంతపు తెలుగు ప్రజలు కేసరి విద్యాలయముల అభివృద్ధికి తోడ్పడి తమ స్వప్రయోజనానికి వినియోగించుకోగలరని ఆశిద్దాం !

తెలుగు బాలబాలికల విద్యావ్యాప్తికిగాను రెండులక్షల రూపాయలతో విద్యాలయముల స్థాపించిన డాక్టరు కే. యన్. కేసరిగారి నాదర్శంగానుంచుకొని దాతలు ప్రజాహితులు ఉదారముగా విరాళములిచ్చి కేసరి విద్యాలయములు అభివృద్ధియగుటకు మద్రాసులోని తెలుగువారేకాక మద్రాసీతరులు సయితము తోడ్పడవలసినదిగా విజ్ఞప్తి చేయుచున్నాము.

---

## చేనేత పరిశ్రమ భవిష్యత్తు ?

చేనేత పరిశ్రమ ప్రకాశవంతమైన భవిష్యత్తుకు అవకాశములు చేనేత ఉత్పత్తుల విక్రయ విడుదల మీద నాధారపడియున్నది.

మంచి విత్తనములెట్లు మంచి పైరుపంటలకు ఆధారమో నాణ్యపు స్థాయికూడ స్థిరీకరణ జరుగాలి. చేనేత వస్త్రాల నాణ్యము మంచినేత, గట్టిచాయ, నికరమైన కొలతమీద నాధారపడియుండును. ఒక మహిళ ఎంతో మోజుపడి బజారులో చీరకొనుక్కొని వెళ్ళి యింటికి వెళ్ళిచూడగా 6 గజాలనికొనినది 5½ గజాలుండియో లేక పైపరుసన నేత బాగుండి నడతలలో నేత బాగుండకనో లేక చాయ నిలుచునని నమ్మికొనినది చాయ పోవుటయో జరిగినచో ఆమె ఎంత నిరుత్సాహపడి చేనేత గుడ్డను ఏవగించుకొనునో ఆలోచించవలసిన విషయము, కాబట్టి నాణ్యం విషయంలో నమ్మకం ఏనాడు చెడరాదు.

చేనేత పరిశ్రమలో ఎప్పటికప్పుడు పరిశోధనాత్మక కృషి సల్పు అనుభవజ్ఞులు చేనేత ఉత్పత్తుల మెరుగగుటకు తోడ్పడుచుండవలెను.

ఉత్పత్తులు నాణ్యమైన, తగిన అమ్మకం వసతులు అమరకపోయినచో పరిశ్రమ అభివృద్ధి చెందనేరదు. వినియోగదారుల అభిమతములను, అభిరుచులను అనుసరించి రకాలు ఉత్పత్తికావాలి. మిల్లు గుడ్డలతో పోటీచేయుట కష్టమైనా ప్రజల అభిరుచుల కనుగుణంగా నాణ్యమైన ఉత్పత్తులను చేనేతపరిశ్రమ విడుదల చేయకలిగినచో అమ్మకం మన దేశంలోనేకాక విదేశాలలో కూడ సులభసాధ్యం కాగలదు. ఇందుకుగాను పరిశోధనాత్మక కృషి అత్యవసరము.

చేనేత ఉత్పత్తుల అమ్మకానికి ప్రచారము, ముమ్మరమైన అమ్మకపు విధానములు సయితము ఆయువుపట్టు.



# కేనోపనిషదు

మూలం :
స్వామి చిన్మయానందజీ

అనువాదం :
డాక్టరు W. రాధాకృష్ణయ్య



ఉపనిషదులు యూరక పఠించినంతలోనే వాటి యభిప్రాయమును కనుగొనుట దుర్లభము. వాటిని శ్రద్ధతో విచారించి, అధ్యయనము జేసిన వాటి యందు, మనకు దృఢనమ్మకము జనించుట తప్పదు.

ఈ ఉపనిషద్ కర్తలు ప్రపంచ జీవితమువట్టి భ్రమయని తీర్మానము జెందిన వెనుక, ఆత్మజ్ఞాన బోధపొందు ఉత్సాహము కలిగినవారై సత్యపురుషుని వెదుకనారంభించినారు. పూర్తి వైరాగ్యముతో, గంగాతీరమున ప్రదేశములుచేరినవారై దివ్యజ్ఞాన పరిశ్రమతో మానవుని దైవీశక్తిని గురించి పూర్తిగా విచారించినారు. పరిపూర్ణజ్ఞానులయినగురువుల వుపదేశములను పొందినవారై ఆ జ్ఞాన జ్యోతిని ప్రజ్వలింపచేసి ప్రకాశము వృద్ధిచేసి, వారి శిష్యులకు వుపదేశించినవారై ఈ గురు శిష్య పరంపరను, అభివృద్ధిచేసినారు.



ఈ ఉపనిషత్కర్తలు, వారి జ్ఞానానంద ఉత్సాహమున, వారు రచించిన ఉపనిషదులకు, తమ కర్తృత్వ నామధేయములు జతపరచుట, ఆవశ్యకమని తలచినవారుకారు. కాన ఈ ఉపనిషదులు, కర్తలపేర్లు మనకు తెలియుటలేదు, వారికి ఆత్మజ్ఞానమే పరమావధిగా తోచెనుగాన వారి నామములు వెలకొల్పవలయునని ఇచ్ఛ జనింపలేదు.

## ఋషులు పిచ్చివారా ?

ఇట్టి సత్యాన్వేషణపరులు, సత్యమునుతప్ప వేరు నుడువుటకు ఎన్నడూ ఉత్సహించరు. వారు సత్యమును వదలిన వేరుగతిలేదని, పూర్తి నమ్మకము కలిగినవారు. వారిపై చక్రవర్తులుకూడా ఆజ్ఞ చేయలేకుండిరి. ఆ చక్రవర్తి జీవితముకూడా, పేదపురుగు వంటిదని వారి యెదుటనే చెప్పగలిగిన ఉత్సాహవంతులు. అట్టివారు ఎన్నటికిని పిచ్చివారు గానేరరు. వారు పరమాత్మ ఉత్కృష్ట జ్ఞానమును వివిధ రీతుల బోధించియున్నారు. కానీ వారు వివిధ రీతుల బోధించు బోధలంతయు ఆ ఏకపరమాత్మవైపునే పోవుచున్నవి.

## ఉపనిషదుల సారము:—

ఉపనిషద్వాక్యములు, అనుభవజ్ఞాన వాక్యములు, తీవ్రశిక్షణవల్ల సూక్ష్మాతి సూక్ష్మజ్ఞాన తేజస్సు వెలుగొంది, ఉన్నత ఆత్మసాన్నిధ్యముపొంది అనుభవించిన విశేషములు కల్ల మాటలుకావు.

ఇట్టి తీవ్ర అనుభవజ్ఞాన వాక్యములు, వేదములయందు మూడవభాగముగా ఏర్పడియున్నవి. వేదములలో మంత్రములు, బ్రాహ్మణములు, అరణ్యకములు, అను మూడు భాగములు కలవు. మొదటిది మంత్ర భాగము. అనేక గుప్తరహస్యములతో—గాంభీర్య మంత్రములుగా నున్నవి. రెండవది బ్రాహ్మణ భాగమున యాగ యజ్ఞముల విధానము తెలుపబడియున్నది. మూడవభాగము ఉపనిషదులు. అరణ్యకములను ఈ ఉపనిషదులు, నిర్మల, నిశ్శబ్ద, గంగా తీరవనములలో శ్రద్ధావినయములతో, ఉపదేశములు

పొందదగిన భాగములు. బాహ్యప్రపంచ వ్యవహారములతో కూడిన సంసారములో కలిసియుండి వీటిని గ్రహించుట దుర్లభము. ఏలన ప్రపంచమున ఒక సూక్ష్మ సమస్య కలిగినప్పుడు మానవుడు, ఏకాంతమునకు వెళ్ళి, తన కష్టనష్టలాభములను విచారించుకొనుట మనము చూచుచున్నాముగదా! అటులనే యీ ఆత్మ విషయజ్ఞానము బొందవలయునన్న సంసారముయొక్క చంచలతనుండీ తొలగవలెను. నిర్మల నిశ్శబ్ద ప్రశాంత ఆవరణము అవశ్యకము.

## వ్యాసులు : వేదములు:-

వ్యాసుల కాలమువరకూ వేదములు గురుశిష్య పరంపరగా, వాగ్ధోరణి, కర్ణశ్రుతములు, వల్లనే ప్రచారములు జరుగుచుండెను. వ్యాసులు, మానవుని జ్ఞానము నెమ్మదిగా మందతపొందుచున్నదని తెలుసుకొని, వేదములను, నాలుగు భాగములుగా గ్రంథరూపములు జేసెను. బహుశా అట్లు గ్రంథరూపము కలిగించుట, అప్పటి పండితమానినులకు, గొప్ప ప్రమాదముగా తోచియుండవచ్చును. తులశీదాసు రామాయణమును హింధీభాషలో అనువదించినపుడును, గొప్ప ఆందోళన సంభవించెను. గీతను, ఉపనిషదులను, ఆంగ్లభాషలో అనువదించినపుడును, గొప్ప ఆందోళన గలిగెను. ఆంగ్లభాషలో సత్సంగ ప్రసంగము పొరబాటని, ఈ యజ్ఞమును, ఆంగ్ల భాషాభిమానులు, జరుపుట పొరబాటని, ఇప్పటి పండితులు కొదువపడుచున్నారు.

ఇట్టి పండితులకన్న గొప్ప హృదయముగలిగి ఉపనిషదుల సత్యము కనుగొని, అందు పూర్ణానుభవముతో మునిగి తేలుచు, ప్రపంచాతీతులైన, గొప్ప మహాత్ములు, ఈ యజ్ఞాధ్యక్షుని గురువర్యులై, ఇట్టి సంస్కరణము ఈ కాలమున, అవశ్యకమని నమ్మిన వారై, ఆంగ్లభాషావేత్తలకు, ఉపనిషదుసారమును బోధించి, వ్యాసభగవానులయొక్క ఔన్నత్యమును ప్రకటించుటకై ఈ ప్రయత్నమును ప్రోత్సహించియున్నారు. కాలము జరుగుకొలది, ప్రపంచమంతయు యీ పునరుద్ధారణాయుద్యమము, సకాలముననే ప్రారంభింపబడినదని మున్ముందు, కృతజ్ఞతా పూర్వకముగా వొప్పుకొనగలుగుదురు. ఈ ఉద్యమము ప్రపంచ శాంతికి తోడ్పడగలదు.

అట్లు వేదవ్యాసులు, పలువురు నేర్చిన మంత్రములనన్ని సేకరించి, పరిశోధించి, నాలుగు వేదములుగా, అందు, మంత్ర, బ్రాహ్మణ అరణ్యక భాగములుగ ప్రకటించెను.

## ఋషుల వైఖరి తనము:-

యోగ్యతగల శిష్యులు, ఈ అరణ్యక భాగములను. పూర్తిగా విమర్శించి, నేర్చి, అనుభవించుటకై ఆ గంగాతీర వనాంతరములకు వెళ్ళేడివారు. అట్లు వెళ్ళువారు, సంసారమునుండీ భయపడి పరుగిడినవారుకారు. తమ కార్యములను, పూర్తిగా నెరవేర్చి, కీర్తిపొందినవారే ఇట్లు వనాంతరములకు వెళ్ళగలుగుచుండిరి. వారికి ఈ ప్రాపంచక జీవితమున, ఎట్టి రుచియు కనుపడలేదు. సంఘమున అల్లరితప్ప వేరు లేదు. ఏకాంతివాసము, అధ్యయనము, మననము, ధ్యానము, ఆత్మత్యాగము, నిర్మలత్వము, వారికి గొప్పవిగా తోచుచుండెను. ఇట్టి పిచ్చి, నవీన శాస్త్రజ్ఞులయందుకూడా కనుగొనుచున్నాము. చిత్రకారులు, శిల్పులు, శాస్త్రపరిశోధకులు, ఏకాంతమునే కోరుదురు.

## సృష్టి కారణ ఆలోచనాపరులు:-

పూర్వకాలమున ఒకముసలివాడు, ఒక కొలను గట్టునకూర్చుని, కొన్ని రాళ్ళను దగ్గరయుంచుకొని ఒక్కొక్కటిగా ఆ నీటిపైని రువ్వుచుండెను. ఇది ఒక పట్టణవాసి గమనించెను. ఉదయము చూచినచోటనే, మధ్యాహ్నాంతముగూడ ఆముసలివాడు కూర్చుని రాళ్ళు రువ్వుచుండుట గమనించి, ఆ పట్టణ వాసి, ఇట్టి సోమరులను, ఎట్టి శిక్షకుపాలుచేసినను, కొదువ లేదని, తలచుచు ఇంటికిపోయెను. కాలముతీరిన ఆ

(107_వ పేజి చూడుడు)

# కేసరి విద్యాలయముల వార్షికోత్సవము

—:o:—

లోక్‌సభ స్పీకర్ శ్రీ ఎం. అనంతశయనం అయ్యంగార్ నేడిక్కడ మైలాపూర్‌లోని కేసరి హైస్కూలులో కేసరి ఎడ్యుకేషన్ సొసైటీ స్థాపక దినోత్సవానికి అధ్యక్షత వహించిన సందర్భంలో ప్రసంగిస్తూ, ఈ సంఘ కార్యకలాపాలకు తన ఆస్తిపాస్తులలో పెద్ద మొత్తాన్ని వినియోగించినందుకు డాక్టర్ కె. ఎన్. కేసరిగారిని ప్రశంసించారు.

ఈ సొసైటీకి ఉదారంగా పెద్ద మొత్తాలను విరాళమిచ్చిన కీర్తిశేషులు శ్రీ ఎం. ఆర్. రాజగోపాల నాయుడుగారి చిత్రపటాన్ని ఆవిష్కరిస్తూ, శ్రీ నాయుడుగారి వితరణశీలం ప్రజలకు ఆదర్శప్రాయం కావాలని ఆయన అన్నారు.

రాష్ట్ర విభజనవల్ల ఏమీ నష్టపడని తెలుగు వ్యాపారస్థులు, తెలుగు సినిమా కళాకారులు ఈ సొసైటీకి విరాళమిచ్చి, ఈ పాఠశాలను కాలేజీగా మార్చడానికి తగిన సౌకర్యాలు కలిగించాలని ఆయన అభ్యర్థించారు.

హిందీ భాషాధ్యయనం కొద్దిగా నిర్బంధం అవసరమని, ముఖ్యంగా దక్షిణ భారతంలో అది ఇంకా అవసరమని అన్నారు.

హిందీని జాతీయ భాషగా అమలుపరచడంవల్ల హిందీ మాతృభాష కానివారి అభివృద్ధికి ఆటంకం కలుగగలదనే భయాందోళనలను ఆయన నిరాకరిస్తూ, ఉత్తరాదివారి భాష అయిన సంస్కృతం దక్షిణాదిన శ్రీ శంకర శ్రీ రామానుజులవంటి మహావిద్వాంసులను అవతరింపజేయడ మొక ఉదాహరణంగా పేర్కొనవచ్చునని, కనుక కొంత సహనంతో హిందీ నేర్చుకోవడం ప్రారంభిస్తే కొంత కాలానికి హిందీ మాతృభాష కానివారుకూడా దానిని నేర్చి మహా పండితులు కాగలరని ఆయన అన్నారు. కనుకనే హిందీని నేర్వడంలో కొంత నిర్బంధం అవసరమన్నారు.

కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు తమ రాష్ట్ర వ్యవహారాలకు ప్రాంతీయ భాషలను వినియోగించడం హర్షించదగిందని అన్నారు. కనుక రాష్ట్రంలో ఏ భాషలో పరిపాలన జరగాలా అనడంలో పేచీలేదని, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు సంబంధించినంతవరకు హిందీలోనే వ్యవహారం జరగాలని పెద్దలు నిర్ణయించారని, కనుక హిందీని జాతీయ భాషగా స్వీకరించవలసిన బాధ్యత గలదని అన్నారు. వారు స్వయంగా ఉత్సాహం చూపకపోతే, నిర్బంధం అవసరం కాగలదని అన్నారు.

చెన్న రాష్ట్రంలోని తెలుగు పాఠశాలల సంగతిని ఆయన ప్రస్తావించి చెన్న రాష్ట్రం క్రమంగా తమిళ భాషలలోనే పరిపాలనా

కార్యక్రమం సాగిస్తున్నది గనుక, ఉద్యోగాలకు తమిళ భాష అవసరం గనుక ఇక్కడి తెలుగు పాఠశాలలలోను తమిళ భాష నేర్పాలని అన్నారు.

ఇకమీదట పాఠశాలలన్నీ బహుళార్థ సాధక పాఠశాలలుగా వుండాలని అన్నారు. తాను ఇంగ్లీషును ద్వేషించేవాడిని కానని, కాని, ఆ భాషను విశ్వవిద్యాలయ విద్యను కోరేవారికి పరిమితం చేయడం అవసరమని అన్నారు. బాలబాలికలు, యన్. సి. సి., ఎ. సి. సి. శిక్షణ పొందాలని దానివల్ల క్రమశిక్షణ దృష్టి, కలిసికట్టుతనం వారికి అలవడగలదని అన్నారు.

ప్రారంభంలో కేసరి ఎడ్యుకేషన్ సొసైటీ అధ్యక్షుడు డాక్టర్ టి. ఎం. ఏ. నెడుంగాడి శ్రీ అనంతశయనం అయ్యంగారికి, ఇతరులకుస్వాగతమిచ్చారు. కార్యదర్శి శ్రీ బి. వి. శ్రీహరిరావు నాయుడుగారు వార్షిక నివేదిక చదివారు. మద్రాసు ప్రభుత్వం విద్యాశాఖ కార్యదర్శి శ్రీ ఆర్. ఎ. గోపాలస్వామిగారి సతీమణి పోటీలలో గెలిచిన విద్యార్థులకు బహుమతులు పంచిపెట్టారు.

విద్యార్థుల చౌచౌ ప్రదర్శనంతో వుత్సవం సమాప్తమైంది.

### శ్రీ హరిరావు నాయుడుగారి అభ్యర్థన

కార్యదర్శి శ్రీ బి. వి. శ్రీహరిరావు నాయుడుగారు నివేదికను సమర్పిస్తూ ఇలా పేర్కొన్నారు:-

"ప్రధాని నెహ్రూ ఇటీవల రాజస్థాన్‌లోగల వనస్థలి విద్యాపీఠంలో ప్రసంగిస్తూ భారతదేశంలో నలుమూలల 6 నుంచి 15 సంవత్సరాలకు లోపుగా వయస్సుగల పిల్లలందరికి ప్రాథమిక విద్యను బోధించడానికి వీలుగా ప్రాథమిక పాఠశాలలను ప్రారంభించడానికి ఉదారంగా విరాళాలు యిచ్చి తోడ్పడవలసిందిగా ప్రజలకు ఉద్బోధించారు. ప్రాథమిక విద్య అన్నిటికంటె ముఖ్యావసరం. కాబట్టి, విద్యావసరాలకు ప్రత్యేకంగా యిచ్చే విరాళాల విషయంలో ఆదాయపు పన్నును మినహాయించాలని నేను కోరుతున్నాను. ఇండియా ప్రభుత్వంతో ఈ విషయాన్ని గురించి సంప్రతింపు జరపడం ద్వారా దానిని సాధించడంలో తోడ్పడవలసిందిగా ఈ సభకు అధ్యక్షత వహించిన లోక్‌సభ స్పీకర్ శ్రీ అనంతశయనం అయ్యంగార్‌కి నేను విజ్ఞప్తి చేస్తున్నాను. ఇట్టి ఏర్పాటు జరగని పక్షంలో ప్రాథమిక విద్యాభివృద్ధి సాధించడానికి హెచ్చుగా విరాళాలు పొందజాలము.

"ప్రాథమిక విద్యార్థులకు ఒకటవ తరగతినుంచి అయిదవ తరగతివరకు మాత్రమే కాక ఏడవ తరగతివరకు గల కొత్త ప్రయిమరీ కోర్సును నిర్బంధ ప్రాథమిక

(109-వ పేజి చూడుడు)

# చేనేత ఉద్యమం

—X—

శ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తి

ఆంధ్రరాష్ట్రంలో చేనేత వుద్యమస్థితిగతుల్ని ఒకసారి పరిశీలించిచూస్తే, మనకెన్నో మనోజ్ఞమైన దృశ్య, శ్రవ్యకాండలు గోచరిస్తవి. వ్యవసాయాన్ని ఒక పరిశ్రమగా భావిస్తే, చేనేత దేశంలో రెండవ పెద్ద పరిశ్రమ; వ్యవసాయం పరిశ్రమ కాకపోతే, చేనేతే అన్నిటికన్నా పెద్ద పరిశ్రమ.

చేనేత పరిశ్రమ ఇక స్థిరపడినట్లే! చేతి, గృహ పరిశ్రమల్లోకల్లా యిది పెద్దది. యంత్రాలలోని గుడ్డల పరిశ్రమకు తీసిపోని పరిశ్రమ; యేదిముందు యేది వెనుకఅన్న వాదోపవాదాలు వుండవచ్చు. కాని యంత్రాల గుడ్డల పరిశ్రమలోకన్నా, చేనేత పరిశ్రమలో హెచ్చుమంది నియుక్తులైయున్నారు. దేశం మొత్తంమీద కోటిమంది జనాభా ఈ పరిశ్రమలో వియుక్తులైయున్నారు. అందువల్ల దాని విశిష్టత తగ్గటానికి వీలులేదు.

దేశంలో 28 లక్షల మగ్గాలున్నవి. అందులో ఆంధ్రలో 5 లక్ష లున్నవి. అంటే, దేశం మొత్తం మీద ఆంధ్ర రమారమి ఐదవ వంతు అన్నమాట. మరో విశేషముంది. తమిళనాడులలోని గుడియాతం, సేలం, మధుర, కోయంబత్తూరు, బరయాన్, తిరుత్తని, చెంగల్పట్టు, వుత్తర ఆర్కాట్, మద్రాసు కేంద్రాలలో చేనేత పారిశ్రామికులూ, చాంద్, నాగపూర్‌లలోనూ, శెషన్నలున్నూ, విశాఖజిల్లా నుంచి రాసత్రి జగన్నాధరావు, ఎర్రా రామారావు, కాశిన నూకరాజు, రాపర్తి హనుమంతరావులున్నూ, గుంటూరునుంచి గుర్రం మల్లయ్య వచ్చారు. వుద్యమం వచ్చింది. బాగా కదిలింది. పలవలు చిలవలు అందుకొంది. చక్కటి కుదురుగల్గిన ప్రజోద్యమంగా పాదుకుంది. ఆంధ్రలో అన్ని మూలలకు అలుముకుంది.

వివిధ జిల్లాలకుప్రాకి, సుస్థిరపడటమేగాక ఆర్థికంగా చేనేత వుద్యమం యెంతో చేవను కూర్చింది. విదేశాలకు యెంతో చేనేత గుడ్డ ఎగుమతి అవుతుంది. అదంతా ఆంధ్రులు కేంద్రాల నిర్మించుకొన్న ప్రాంతాలనుంచే పోతుంది. సిలోన్, బర్మా, ఏడెన్, ఇండోనీసియా, పశ్చిమ ఆఫ్రికా రాజ్యాలు కొన్ని కోట్ల రూపాయల విలువగల గుడ్డను మన ప్రాంతం నుంచి కొనుగోలు చేస్తున్నవి. గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, మద్రాసు కేంద్రాలనుంచే 3 కోట్ల కిమ్మత్తుగల చేతిగుడ్డల ఎగుమతి సాలీనా జరుగుతుంది. 'బుద్దాబాసి' అనే పేరుతో చేనేత గుడ్డను టర్కీ, ఇరాన్, ఇరాక్ మొదలైన ముస్లిందేశాలు కోట్ల రూపాయల గుడ్డను కొంటారు. సిలోన్, సింగపూర్, మలయా, బర్మా, ఇండోనీసియాలు లుంగీలు, చీరలు చేనేతవి విశేషంగా కొంటారు. వాటిలో హెచ్చుభాగం మన ప్రాంతాలనుంచే పోతుంది.

యుద్ధానంతరం పరిస్థితులలో, ఎగుమతులు పెరిగినై. దేశ ఆర్థికస్థితికే తోడునీడగా వుండగలస్థితి ఈ పరిశ్రమకు వచ్చింది. ఒకరిని దోపిడిచేయకుండా, ఒకరిచే విశేషంగా దోపిడిచేయబడకుండా, కోటి ప్రజలకు జీవగర్రగావుండి, ప్రభుత్వాన్ని పెద్దగా పెట్టుబడులు పెట్టమని వత్తిడిచేయని వుద్యమం చేనేత వుద్యమం. దాని ప్రధాన విశిష్టత యిదే!

అయినా, కొన్ని యడల ప్రభుత్వపు వుదాసీనత వల్ల అలజడి వుద్యమాలు చేయవలసివచ్చింది. కుమారస్వామిరాజా ప్రధానిగా వుండగా, చేనేత కాంగ్రెస్ సంస్థ సత్యాగ్రహం చేసింది. 10 వేలమంది అరెస్టు అయ్యారు. రాష్ట్రంలో గగ్గోలు రేగింది. గుంటూరు, నెల్లూరు, బందరు, విశాఖ, కడపలనుంచి సత్యాగ్రహులు ఈగలలా ముసిరారు. రాష్ట్ర ప్రభుత్వానికి కుదరకపోతే, కేంద్రపారిశ్రామిక మంత్రి శ్రీ హరేకృష్ణ మెహతాబ్ వచ్చి రాజీ చేశారు.

రాజీపరంగా, చేనేతవారు కోరిన రీతిని నూలు

(108—వ పేజి చూడుడు)

# స్మృతిపథంలో గాంధీజీ

ప్యారిలాల్

—:o:—

నేను, గాంధీజీని ప్రథమంగా ౧౯౧౯ క్రిస్మస్ పండగలలో అమృతసర్ పట్టణంలో చూశాను. అప్పుడు నేను లాహోర్ ప్రభుత్వ కళాశాలలో ఎం. ఏ. చదువుతూ ఉండేవాడిని. కాంగ్రెస్ సమావేశం చూడడానికి అమృతసర్ వెళ్లాను.

శీతాకాలం ఎముకలు కొరికే చలి. దానికితోడు కుండపోతగా వాన. స్టేషనునుంచి మా స్నేహితుడి ఇంటికి నడచి వెళ్లాను. దారంతా బురదమయం. ఇంటి మెట్లదగ్గరకు చేరుకోగానే అక్కడ భారతీయ నాయకుల బృందం ఒకటి కనబడింది. వారిలో అందరూ దిగ్దంతులే. వారిలో గాంధీజీ ఒకరు.

నగరంలోని ప్రముఖ వ్యాపారస్థులను కలుసుకోడానికి వారక్కడకు వచ్చారు. ఒక్కమారు ఇంత మంది మహానుభావులను చూడగానే నాకు ఒళ్లు గగుర్పొడిచింది. వారు నా వెనుక రావడం గమనించి పక్కనున్న తలుపు చాటుకు ఒదిగి నుంచుని వారికి దారిచ్చాను. నేనున్న చోటునుండి వారి సంభాషణలు వినిపించాయి.

జలియన్ వాలా బాగ్ ప్రాంతాన్ని స్వాధీన పరచుకుని స్వాతంత్ర్య సాధనకై జరిగిన తొలి అహింసా సమరంలో బలి అయిన వీరులకు అక్కడ స్మారకచిహ్నం నెలకొల్పాలని అప్పుడే కాంగ్రెసు నిశ్చయించింది. కానీ ఆ స్థలంకొనడానికి డబ్బురావాలి. అది దొరికే సూచనలు కనబడలేదు. మొండికెత్తిపోయిన అక్కడి వ్యాపారస్థులను బ్రతిమాలి వారితో వాదించి విరాళాలు సంపాదించాలని నాయకులు చేసిన సకల ప్రయత్నాలు వృధా అయిపోయాయి.

చివరికి గాంధీజీ వంతువచ్చింది. ఈ పెద్ద మనిషి వణిజుల దగ్గర స్తుతి పాఠాలు మొదలు పెట్టలేదు. దేశభక్తి పేరిట ప్రాధేయపడి వారిని ఉద్రేకపరచి డబ్బు విదిల్పించాలని ప్రయత్నించలేదు. "దేశం పేరిట మనసారా ఒక నిర్ణయం చేశాం. అది చెల్లక విఫలమవడం నాకు గిట్టదు. దీనికి కావలసిన డబ్బు మీరియ్యాలి. లేదా నేను నా ఆశ్రమాన్ని తెగనమ్మైనా కావలసిన సొమ్ము పుట్టిస్తా." అన్నాడాయన ఇంతే. సూటిగా ముక్కుసూటిగా ఆయన అన్నయీ మూడుమాటలలోనూ తిరుగులేని శక్తి ఏదో ఉంది. ఏదో పని మిగిలిపోతోందన్న తొందర స్ఫురించింది. ఈ మాట చెల్లితీరాలి అన్న ధీమా ఆ కంఠంలో దారుఢ్యం, క్షణంలో పనిచేశాయి. మొండికెత్తారనుకున్న వర్తకులు కాస్తా ఇట్టే మతం మార్చుకున్నారు.

గాంధీ అంతటి ఉద్దండుడు. ఆయన శక్తి అంతటిది. మనసారా నమ్మిన మాటను సూటిగా చెప్పేవాడు. చెప్పినమాటను మనసారా నమ్మేవాడు. వర్తకులను మార్చగలిగేది వాళ్ళ మొండితనాన్ని పరిమార్చగలిగేదీ ఇలాంటి మాటే. సరే తక్షణమే వాళ్ళు కావలసిన డబ్బు ఇవ్వగలమని మాట ఇచ్చేశారు. వాటినుండి వణిజవర్గానికి అదే పరవడి అయింది. రాను రాను స్వాతంత్ర్య సమరానికి అదే పునాదిగా నిలచింది.

కొన్ని వారాల తరువాత గాంధిజీని కలుసుకోడానికని లాహూర్ వెళ్లాను. సైనిక శాసనం అమలు జరుపుతూన్న రోజులవి. రాజకీయ విద్రోహులనే పేరిట పలువురు భారతీయులను విచారణ జరుపుతున్నారు. వీరి తాలూకు స్నేహితులు చుట్టాలు ఎల్లప్పుడూ గాంధీజీని చుట్టుముట్టి ఉండేవారు.

నేను అక్కడికి వెళ్లిన సమయానికి ఆయన వద్ద ఇలాటివారే కొందరు కూర్చుని ఉన్నారు. వారి తాలూకు మనిషిని రాజకీయ సంబంధమైన

విషయాలపై హత్యా నేరంమోపి పట్టుకుపోయారు. అతనిని రక్షించమని వారు గాంధీజీని కోరుతున్నారు. ఆ రోజులలో అలాటినేరం జేయడం బహుప్రమాదకరం. ఆ నేరస్తుడిచుట్టాలు స్నేహితులూ నిరాశతో ఉన్నా గాంధీజీ వారిని ఓదార్చారు.

"పూర్తివివరాలన్నీ నాకు తెలియజేయండి, అతడు తప్పుచేసిఉంటే నాకు నిజం చెప్పండి" అని ఆయన అన్నాడు. "ఎంత ఘోరమైన హంతకుడైనా రక్షించి బాగుచెయ్యవచ్చు. నా ఆశ్రమంలో అలాటి వారున్నారు. ఈనాడువారు నాకు ఎంతో నమ్మకస్థులయిన సహచరులు."

రాజకీయ వ్యవహారాలకు ఆధ్యాత్మిక సూత్రాలు పట్టించడం నాకు కొత్తనిపించింది. వింతగాతోచింది. అభేద్యమైన కూడ్యంవంటి యీ సమస్యను ఛేదించడానికి ఈయన ఏదో కొత్తమార్గంకనిపెట్టాడనిపించింది. ఆ మనిషి కంఠస్వరంలో రాజనీతి తొణికిసలాడింది. ఆ మాటలలో ఒక నిండుతనం, హుందాతనం ఉన్నాయి. అపారమైన వాత్సల్యం చిప్పిలుతోంది.

దానికి సరిహద్దులులేవు. ఆ దృష్టిలో అపాత్రత లేదు. ఎంతదుర్మార్గుడైనా బాగుచేయవచ్చును అన్న నమ్మకంవుంది. అలాచేసి సాధించగల మహత్తరమైనశక్తి ఏదో ఆయనలో గోచరించింది. ఆ శక్తికి అసాధ్యమైనదిలేదు, అది అధిగమించరాని హద్దులేదు. మనసారా ఆ శక్తిని నమ్మాలి. నేను ముగ్ధుడినైపోయాను. ఈయన మహాపురుషుడు, నాకు ఆచార్యుడనుకున్నాను. ఆక్షణాననేనాయనకు శిష్యుడనయిపోయాను.

కొద్ది రోజుల్లోనే నేను శబర్మతి ఆశ్రమంలో చేరాను. కొత్తవాళ్ళకి, కార్యాచరణ దృష్టిలేని వాళ్ళకి అక్కడ చాలా విసుగెత్తుతుందనిపిస్తుంది. దిగులుగా ఉంటుంది, అక్కడి వాళ్లంతా కూలీల్లాగా ఏదో కాయకష్టం చేస్తున్నట్టనిపిస్తుంది. పోతే అక్కడున్న సదుపాయాలు కూడా చాలా పాతరకం మోటురకం అనిపిస్తాయి. శబర్మతి అంటే ఏమిటో అనుకుని చాలా ఉత్సాహంగా వచ్చిన పెద్ద పెద్ద మేధావులే ఇక్కడి పద్ధతులు చూసి పెదిమిచప్పరించి నిరుత్సాహంలో చక్కాబోయారు. అయినా నిజానికిది గాంధీజీ రాజకీయ వ్యాసంగానికి కీలకం అంతర్గచోటు. వీళ్ళంతా ఎందుకిలాగ ఉంటున్నారు అని ముందర అనిపించినా ఆశ్రమతత్వం వంటబట్టాక అక్కడి శ్రమశిక్షణ విధానాలు, వాటి అంతర్యాలు బోధపడ్డాక అంతా తేటతెల్లంగా తెలుస్తుంది.

నేనక్కడ చేరిన కొద్దిరోజుల తరువాత ఒకనాడు సాయంత్రం మేమందరం గాంధీజీ వెంట వ్యాహ్యాళికి బయలుదేరాం. తీరా చూస్తే ఆయన ముఖ్యస్థానం శబర్మతి సెంట్రల్ జైలు. "అదే మన రెండో ఆశ్రమం" అన్నారాయన — దాన్ని చూపించి. ఆఛలోక్తివిని అందరూ పకపకనవ్వేశారు. తిరిగివస్తున్నప్పుడు ఆయన ఆఛలోక్తిలోపరమార్థాన్ని విడమరచి చెప్పారు. "మన ఆశ్రమంలో గోడలు లేవు. ఉన్నవల్లా మననియమాలు, నిగ్రహాలు మాత్రమే. అవి మన్ని ఆపేవి కావు. రక్షించేందుకే ఉన్నవి. స్వచ్ఛందంగా మనస్ఫూర్తిగావాటినిమనం మన్నించి పాటిస్తేనే నిజమైన స్వేచ్ఛ అంటే ఏమిటో తెలుస్తుంది. అపుడే దాన్ని అనుభవించగలం. ఈ నియమ, నిగ్రహాలే మన ఆయుధాలు. అవి దగ్గర ఉంటే మనం, ఎక్కడేనా నెగ్గుకురాగలం. ఎలాటి విపత్తునైనా సునాయాసంగా ఎదుర్కోగలం. నిజానికి చెరసాల జీవితంకన్న, ఇక్కడి యీ ఆశ్రమ జీవితమే కఠినతరం.

"ఈఖైదులో ఉన్నప్పుడు ఎవడన్నా వచ్చి దోచుకుపోడానికి మనకు మనది అన్న ఆస్తి ఉండదు. మనకిరాకుండా పోతాయేమో అని బెంగ పడడానికి అమర్చిసిద్ధంగాఉన్న సుఖాలూ ఉండవు. దుష్కార్యాలు చేయడానికి అసలే వీలుండదు. భయం అంతకన్నా ఉండదు. దైవభీతి ఒకటే నిలుస్తుంది. స్వాతంత్ర్యం నా జన్మహక్కు అని

చాటి దానికి సంతోషంగా ప్రాణాలు కూడా అర్పించగల శక్తి వస్తుంది.

"స్వాతంత్ర్యసమరం పేరిట చెరసాలకు వెళ్ళిన వ్యక్తి మామూలు జైలు జీవితంలో వచ్చే కష్టాలకు ఇబ్బందులకూ సిద్ధపడి అలా కష్టపడడం తను నమ్మిన సత్యంకోసం పరోక్షంగా తపన చెందడమే అని భావించి అక్కడ ఉంటాడు. కాబట్టి కటకటాల వెనుక ఖైదీగా ఉన్నా స్వతంత్ర్యుడననే అనుభూతి పొందుతాడు. చెరసాల అనేది వ్యక్తికే తప్ప అతనిలోని శక్తికి కాదు. దేశమంతా కష్టాలను ఈ విధంగా అర్థం చేసుకుని అనుభవించగలగడం నేర్చుకున్నప్పుడు, స్వాతంత్ర్యం సిద్ధించినట్లే అవుతుంది. ఆనాడు, పరాయి పాలకులు మన దేశం అంతటినీ ఒక పెద్ద చెరసాలగా మార్చివేసినా వాళ్ళు మనుష్యులనే బంధించగలరు తప్ప, భారతీయ హృదయాన్ని, ఆత్మను తాకలేరు.

గాంధీజీ 1920లో ఈ మాటలు చెప్పారు. అహింసా సమరానికి ఇదే బాట అయింది. ఇదే బలమయింది. ఆశ్రమంలో శిక్షణ పొందిన వాళ్ళంతా ప్రజల్లోకి వెళ్ళి ఉద్యమం సాగించినపుడు సహనంతో నిశ్శబ్దంగా బాధలు భరించడం ద్వారా ఈ సందేశాన్ని ప్రజలకు అందించగలిగారు. సుబోధకం చేయగలిగారు.

అయితే ఈ వెళ్ళినవారంతా అసాధారణ వ్యక్తులనీ వీళ్ళంతా బ్రహ్మాండమైన సత్యాలను ఎలుగెత్తి చాటి ప్రజని చకితుల్ని చేశారనీ అనుకోనక్కరలేదు. ఈ పద్ధతులు వాటిలో గర్భితమైన సూత్రాలను నిర్దుష్టమైన రూపకల్పనలు అని చెప్పలేము. అయినప్పటికి అసమగ్రమైన ఈ పద్ధతులే ప్రజా బాహుళ్యంలోకి వెళ్ళినపుడు అందరూ వీటిని అనుసరించినపుడు చెప్పరానంత శక్తిని పోసుకున్నాయి. ఒక కొత్త వాతావరణాన్ని సృష్టించాయి. బ్రహ్మాండమైన నౌకను ఏయేళ్ళనుండో నిశ్చలమార్గంలో నడిపే చుక్కానిగా వీరిలోని శక్తి ఉద్యమాన్ని, సంఘటనలను కొత్త మార్గంలో ముందుకు నడపగలిగింది.

నేను, ఆశ్రమంలో ఒక నెల ఉన్న తరువాత, ఒక రోజున గాంధీజీనుంచి తంతి వచ్చింది. వెంటనే ఢిల్లీకి వచ్చి తన పర్యటనలో తోడుగా రమ్మన్నారు. ఆ తరువాతి రోజులలో ఆయన గురించి నేను ఎన్నో విషయాలు తెలుసుకున్నాను.

ఆయనలో రోజుల తరబడి, మూడు నాలుగు గంటల నిద్రతో సరిపుచ్చుకుని, ఒకోమారు అసలు నిద్రేలేకుండా నిర్విరామంగా పనిచేయగల అద్భుతమైన శక్తి ఉంది. ఆయన ప్రతి చిన్న విషయంపట్లా కూడా ఎంతో శ్రద్ధ చూపించేవారు. వారి శుద్ధ్యం, పరిశుభ్రత విషయాలలో అత్యంత జాగరూకత వహించేవారు. రాయడంలో అయితేనేమి, ఆలోచనలో అయితేనేమి, ఏ దైనందిన కార్యకలాపంలోనైన సోమరితనం కనబరిస్తే ఆయన సహించేవారు కాదు. ఆయనలోని మరొక ఉత్తమలక్షణం సైనిక శిక్షణకు ఉజ్జీ అయిన క్రమశిక్షణ. అనుకున్న సమయానికి అనుకున్న పని చేసితీరాలని ఆయన బోధించేవాడు. చేసి చూపేవాడు. సాధ్యమైనంతవరకూ అన్ని పనులూ తనే చేసుకునేవాడు.

ఏదేనా కాగితం కావలసివచ్చినా, ఏదేనా వస్తువు కావలసివచ్చినా ఆయన లేచివెళ్ళి తెచ్చుకునేవాడు. బట్టలుకూడా తనే కుట్టుకునేవాడు. చెప్పి రాయించుకునేకంటే తనే స్వంతంగా ఉత్తరాలు అవీ రాసుకునేవాడు. ఒక రోజున ఆయన ఎడతెగకుండా ౫౬ ఉత్తరాలు రాయడం చూశాను. తేది దగ్గరనుంచి, ఉత్తరంమీద విలాసం రాయడంవరకూ మొత్తం ఆయనే రాశాడు. ఒక్కొక్కటి రాసిన తరువాత మళ్ళీ పూర్తిగా ఓమారు చదువుకున్నాడు. అంతా అయిన తరువాత అలసిపోయి, అదురుతూన్న కణతలను వేళ్ళతో అదుముకుంటూ కూచున్నచోటే కటిక నేలమీద ఒరిగి పడుకున్నాడు. పక్కనున్న పక్క పరచుకోడానికికూడా ఓపిక లేనంతగా ఆయన అలసిపోయాడు.

మరోమారు జరిగిన ఒక సంఘటన నా మనస్సులో

చెరగని ముద్రగా నిలిచిపోయింది. లాహోర్‌లో గాంధీజీ, లాలా లజపతిరాయి దగ్గర మకాం చేశాడు. అప్పటికి పంజాబ్ కేసరి, సహాయ నిరాకరణోద్యమాన్ని పూర్తిగా ఆమోదించలేదు. కొందరు పంజాబీ నాయకులు గాంధీజీవద్దకువచ్చి, తాము గాంధీజీ నాయకత్వాన కొత్త మార్గాన్ని అవలంబిస్తామని చెప్పారు. గాంధీజీ దానికి ససేమిరా వీలు లేదన్నాడు.

పంజాబు ప్రాంతం లాలాజీక్రిందఉంది. లాలాజీ మార్గంనుంచి చీలి ఇంకొక మార్గం అవలంబించాలన్న ఉద్దేశానికి తాను మద్దతు ఇవ్వజాలను అని ఆయన చెప్పారు. అలా చేస్తే తన సహచరునికి అన్యాయం చేసినట్లవుతుంది. తాను తన జీవితంలో ఎన్నడూ అలాటిపని చేయలేదు. పంజాబులో ఉన్నన్నాళ్లూ లాలాజీతో కలిసి, ఆయనను సంప్రతించే ఏపనైనా చేసేది. తనకూ లాలాజీకి మధ్య అభిప్రాయ భేదాలొచ్చినపుడు వారు లాలాజీ మాటనే మన్నించాలని గాంధీజీ వారికి బోధించారు.

ఆ సమయాన లాలాజీ పక్కగదిలో కూచుని ఉన్నారు. ఈ సంభాషణ అంతా విన్నారు. ఆయన మనస్సు కదిలిపోయింది. గాంధీజీ — లాలాజీల మధ్య ఏర్పడిన అచంచల యావజ్జీవ స్నేహానికి అదే పునాది. గాంధీజీ, తన సహచరులపట్ల, యావజ్జీవితమూ అలాగే నడచుకున్నారు.

గాంధీజీ సాన్నిధ్యాన ఉన్నప్పుడు, నాకు, ఆయన బహుముఖవ్యక్తిత్వాన్ని గురించి ఎన్నో సంగతులు తెలుసుకునే అవకాశం లభించింది. వాళ్ల గురించి చెప్పాలని అనుకున్నంతా చెప్పడానికి సాధ్యంకాదు. ఆయన మహాత్ముడు. విశ్వాత్ముడు. అన్ని విధాలయిన ప్రమాణాలకీ అతీతుడు. కానీ ఆయన గురించి నా స్మృతిపథంలో కనబడే విగ్రహం అతి సౌమ్యమైనది. వినమ్రత, వాత్సల్యం, అమూర్తిలో తొణికిసలాడుతూ ఉంటుంది. రాత్రి పూట స్నానాలగదిలోకి వెళ్లవలసివచ్చినపుడు, చుట్టూ నేలమీద పడుకున్నవారికి నిద్రాభంగం కలగకుండా ఆయన చెప్పులు విడిచి నడిచివెళ్ళేవాడు.

రాజులు, రారాజులు, మొదలగు వారి పక్కన కొల్లాయిగుడ్డకట్టుకుని నడుస్తున్నా ఆయనలోని ఠీవి తగ్గదు. చూపరులకు పూజ్యభావం కలగక తప్పదు. ఒకమారు ఒక బీద కుష్టురోగి తన ఆశ్రమానికి వచ్చినపుడు, గాంధీజీ వైస్‌రాయి అంతటివాడిని కలుసుకోవలసినపని ఉన్నా అది మానుకుని, ఆ సామాన్యుడికి సేవచేశాడు. నిర్దాక్షిణ్యంగా పరిగెత్తే కాలగమనంలో ప్రతి నిమిషంలోని క్షణాన్నీ పూర్తిగా సద్వినియోగం చెయ్యడం ఎలాగ అన్నది ఆయనకు తెలిసినంత మరొకరికి తెలియదు. విజయాన్ని విపత్తునికూడా ఒకే దృష్టితో చూచి ఒకే భావంతో ఎదుర్కొని, రాజుకు బెణుకులేకుండా ముందుకు సాగడం అన్న విద్యకు ఆయన పెట్టింది పేరు. ఆ రెండిటికీ ఆయన అతీతుడు.

ఆయన సాన్నిధ్యంలో ఉన్నవారికి పరాజయం, అందులోని బాధ గురించి పట్టించుకునే అవసరం ఉండేదికాదు. ఎందుకంటే ఆయన ఎన్నడు విజయం కోసం తాపత్రయపడలేదు. సత్య సందర్శనంకోసమే తన జీవితాన్ని అంకితంచేశాడు. భగవద్గీత తనకు కార్యాకార్య నిర్వచనాలను చెప్పే నిఘంటువు అనేవాడు. భగవద్గీతలో చెప్పిన ఆదర్శపురుషుడు ఈయనే అనిపిస్తుంది. ఆయన స్థితప్రజ్ఞుడు, మహాజ్ఞాని. అచంచల ధీరుడు. ధైర్య స్థైర్యాలమూర్తి. ఇంతటి అవతారమూర్తి పునర్దర్శనం ఎన్నటికో !



# శ్రీ రామకర్ణామృతము

(ఆంధ్రానువాదము)

ద్వితీయాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గత సంచిక తరువాయి)

౧౧

పది రేకులను గల్గు పంకజంబొక్కటి
శ్రీ విష్ణుగ్రంథియై చెలువొసంగు
'డా'కారము మొదలు 'పా'కార పర్యంత
మక్షరరూపమై యలరు నట్టి
చక్రంబునన్నీవు శంఖ చక్రములతో
సూర్యుని కాంతితో సొబగు మీఱి
పీతాంబరము దాల్చి, ప్రియమైన కౌస్తుభ
మణిఁబూని, సీతారమణినిగూడి

వాసమొనరించుచున్నావు! వరద! రామ
భద్ర! తారకరాముఁడై భక్త తతికి
వరములొసఁగెద వీవు! సర్వస్వరూప!
నిన్ను సేవింతు, రక్షింపు నిగమచరిత!

౧౨

'కారాంత' వర్ణముల్, కమలాక్ష!
నీరూప
మై, యొప్పుచుండు; మహాత్మ! సూర్య
రూపుండవై హంసరూపుండవై, నీవు
భవ్యుని రూపంబవై, భవ్యమైన
మోక్షలక్ష్మినిగూడి, భువిధనుర్విద్యలో
గురుఁడవై, శ్రీరామ! బరగినావు;
ఓంకార మధ్యమందుజ్జ్వలంబుగఁ బ్రకా
శించి, తారక నామ! చెలఁగినావు!

ప్రాణవాయువులందొప్పి బరగినావు,
ప్రళయ సూర్యులతో సాటివచ్చునట్టి
రూపమును దాల్చినావు; నీ కోపమడచి
భక్తులను కావు మా-రామ! వందనంబు!

౧౩

జీవాత్మకనయంబు శ్రీకరస్థానమై
షోడశదళపద్మ శోభితుఁడయి
రక్తిమిఁ బొఱంగ రుద్రగ్రంథిరూపమై
యమృతంబువలెఁజల్లనై, చెలంగి
భవ్యమైనట్టి శుభ్రజ్యోతి రూపుఁడై
దేహంబుతోఁగూడి దివ్యుఁడగుచు
తలపోసి చూడ, శబ్దబ్రహ్మమందు, ని
వాసుఁడై, శ్రీరామ! వాసుదేవ!

శ్రీమనోన్మని పథమందు చెలఁగి, శ్రీ, ము
కుంద! జాలంధ్ర పీఠంబునందు వెలసి
భక్తజనములఁ బ్రోచెడి ముక్తివరద!
భజనసేతును రక్షింపు; పరమపురుష!

౫౮

జ్యోతి స్వరూపుఁడై, సీతాసమేతుఁడై
వేదశాస్త్రములచే, వేద్యుఁడగుచు
చంద్రస్వరూపుఁడై సచ్చిదానందుఁడై
సుఖదుఃఖములు లేక, సూక్ష్ముఁడగుచు
నిఖిలార్థతత్త్వుఁడై, నిర్మల హృదయుఁడై
భ్రూమధ్యమున, వాసమును, సలుపుచు
శ్రీసుషుమ్నస్థాన వాసంబుఁ గైకొని
ప్రళయ సూర్యుని భంగి ప్రభలనెల్ల

దిశల వెల్గొందఁ జేయుచు, దీనజనులఁ
బ్రోచి, శరణన్నఁ గాచి, సంపూర్ణకరుణఁ
జూపు తారక రామ! సంస్తుతులొనర్తు
దుఃఖములఁ బాపి రక్షింపు తోయజాక్ష!

౫౯

శ్రీ ర్షాంబుజమునందుఁ జెలువారు కర్ణిక
యందుఁ బ్రశస్తమా యమృతంపు
సాగరవీచికా శస్త్రప్రవాహంబు
చెల్వొందు ; శ్రీ మోక్షసిద్ధి పీఠ
మందు, శబ్దబ్రహ్మమరుదారగాఁ బ్రధా
నస్థానమువహించునయము మీఱ ;

స్థావర జంగమతతికి గురుండవై
శాశ్వతుండైన, ఈశ్వరుఁడవీవె!
పరగ నుత్కృష్ట తేజస్సు వరలఁ జేసి
నేత్రముల, కగోచరుఁడయి, నీలవేణి
సీతతోఁ గూడి, శోభిల్లు శ్రీశుభాంగ!
ప్రార్థనమొనర్తు రక్షింపు రాఘవేంద్ర!

౬౦

సాకేతపురములో, జలజాప్తకోటి, స
న్నిభమైన హర్మ్యంబు నెగడియుండు ;
నందుండు రత్నసింహాసనం బెక్కి ? యా
నందమూర్తివయి, ముకుంద! రామ!
శ్రీ మునీశ్వరులెల్లఁ జెలఁగి నిన్సేవింప
చెలువొందుచున్నావు శ్రేష్ఠముగను
వామాంకమున సీత వసియింపుచుండంగ
నీలమేఘశ్యామ! నిగమచరిత!
దేవతాశ్రేష్ఠులనయంబు సేవసలుప
ముఱియుచున్నావు శ్రీరామ! మోహ
నాంగ!

చిత్తశుద్ధిని సేవింతు శ్రీ విలాస!
రక్షణమొనర్పుమయ్య శ్రీ రామభద్ర!

(సశేషము)



# బిడ్డలు - తల్లిదండ్రులు

## నిర్మాణాత్మక క్రమ శిక్షణ

శ్రీ కె. వెంకట్రామయ్య



(గతసంచిక తరువాయి)

### సహకారము నొందెడి క్రమశిక్షణ:-

### (Discipline that gains Co-operation)

బిడ్డల నెప్పుడును దండింపనేకూడదా? అనెడి ప్రశ్నగలదు. దండింపవచ్చును. కాని ఆ దండన బిడ్డలు, భయముచేగాక, కారణమును తెలిసికొని తమ్ము తామే నిగ్రహించుకొనెడి విధము కావలెను. నీతివంతులగుట భయముచేకాకూడదు. ఆత్మనిగ్రహముచే కావలెను. ఈ లక్ష్యముతో దండన నొసగునపుడు బిడ్డచేసిన పనినేగాక దాని నతడే యుద్దేశముతో చేసినదియుగూడ నాలోచింపవలసియుండును. అతడొక తప్పుపనిని చేసినపుడు దానిని అపరాధముగా జూచుటగాక, అంతకు వేరైన దృష్టితో చూడవలెను. ఆ పని యేవిధముగ తప్పో తెలియజేయుటయే మన యుద్దేశము కావలెనుగాని, ఇంత తప్పునకు ఇంత దెబ్బయని దండించుటకారాదు. ఉదాహరణలవలన ఇది విశదముకాగలదు — మా బడిలో ఒక పెంపుడు చిలుక యుండెను. అది బడికంతకును చెందినది. ప్రతిదినమును, ఇద్దరిద్దరు పిల్లలు, వంతుల ప్రకారముగా, ఆ పక్షి సంరక్షణ బాధ్యతను వహించుట వాడుకయైయుండెను. ఒకదినమున ఆ బాధ్యతను వహించుట పదేండ్లవయస్సుపిల్ల లిరువురిపనియయ్యెను. నేనాదినమున పంజరముకడకు పోయి చూడగా అది తెరచియుండెను. చిలుక ఎగిరి పోయెను. పంజరము నెవరు తెరచిరని నేనడుగగా ఇరువురును తమకు తెలియదనియే నుడివిరి. వారి మాటలను నేనమ్మితిని. అందుచే వారిలో నేవొక్కరినిగూడ ఆ పక్షి యెగిరిపోవుటకు కారకులని నేతలంపకుంటిని. ఐనను అది యెగిరిపోకుండ జూచుకొనెడిబాధ్యతఇరువురిదిని ఐయ్యున్నదిగదా! కనుకపక్షి యెగిరిపోయినదానికి ఇరువురిని సమాన బాధ్యులుగనే గణించితిని. అది వారికి న్యాయముగనే తోచెను. కాదనక ఒప్పుకొనిరి. "కాని ఇక ఏమిచేయవలెను. ఆ పోయిన చిలుక బడిదిగదా!" అని నేనంటిని. "మరియొక దానిని తెత్తము" అని వారిలో నొకడనెను. "ఔను, నీవు చెప్పినది సరియే, దానిని మరి చేయుటెట్లు?" అని నేనడుగగా "మా నాన్నను డబ్బిమ్మని యడిగెద"నని యతడు బదులు పలికెను. రెండవవాడును దానికి తలయూచెను. "ఆ పక్షిని పోగొట్టినది మీ నాన్నకాదే! అతడేల డబ్బియవలెను?" అని నేననగా "అది నిజమే, మా సొమ్మునే ఈయవలెను. నా కడ ఆరణాలున్నవి. అతనివద్ద కొంత ఉన్నది. — అంతయు కలిపికూడ చాలదే" అని వారిలో నొక బిడ్డ యోచనచేయసాగెను. "నీ యోచన చాల మంచిదనియే నాకు తోచుచున్నది" అని నేనంటిని. మొదటినుండియు నా మనముననున్న ఉద్దేశమును అదియే. ఐనను అది వారికే తోచవలెనని నేవేచియుంటిని. ఇక మరికొంత ప్రసంగము జరిపిన పిదప మేమొక నిర్ణయమునకు వచ్చితిమి. దాని ప్రకారముగ బడివదలినంతనే నేను వారిండ్లకుపోయి వారి తల్లులతో విషయమునంతయు ముచ్చటించి ఒక యేర్పాటును చేసితిని తమ పిల్లలచే వారు ప్రతి దినమును ఒక ప్రత్యేకపు పనిని చేయించవలెను. ఆ చేసినదానికై ఒక అణా నిచ్చుచుండవలెను. ప్రతి పిల్లవాడును ఒకటిన్నర రూపాయి నార్జించువరకు అట్లు పనిచేయుచుండ

వలెను. ప్రతి సోమవారమును ఆ వారములో నార్జించిన సొమ్మును దెచ్చి నా కిచ్చుచుండవలెను. ఈ యేర్పాటునకు వారందరును ఒప్పుకొనిరి.

పిల్లలు ఏకోపమును లేక పనిచేయుట కారంభించిరి. పనిచేయుట కష్టమేకాని తమ తప్పును సవరించుకొనుట కదియే తగిన మార్గము. పిల్లలు సంతోషముతో పనిచేయుటనుజూచి తల్లులచ్చెరువొందిరి. వారార్జించిన సొమ్ముతో తుదకొక చిలుకను కొంటిమి. అప్పుడు వారి యానందమునకు మేరలేదు. పక్షినికొన్న మొదటివారమంతయు వారే దాని సంరక్షణ బాధ్యతను వహించిరి.

పిల్లలు పొందిన దండన వారి యజాగ్రత్తకేగాని పక్షిని పోగొట్టినందులకుగాదు. పూచికపుల్ల పోయినను అజాగ్రత్త అజాగ్రత్తయే. ఇట్లు తమ తప్పునకు మూలకారణమేదో తెలిపెడి దండన బిడ్డలకెంతయు సమంజసముగనే తోచును. పిల్లలకు న్యాయబుద్ధి మెండు. న్యాయమునకు కట్టుబడుదురు, వారితో సవ్యముగా వ్యవహరింపవలెనేగాని చేసిన చెడు పనిని సవరించుకొనుటకు వారేమియు వెనుదీయరు.

## ఆయా బిడ్డలకు తగురీతిని శిక్షణ విధానమును సవరించుకొనవలెను.

ఒకే విధమగు శిక్షణపద్ధతిని బిడ్డ వయస్సునకు తగు రీతిని అనుసరించుటయెట్లో ఉదాహరణలచే బోధపడగలదు. కిండర్ గార్టెను బడియందలి నాలుగేండ్ల పిల్లవాడొకడు తోటిపిల్లలతో కలసి యాడక అల్లరి చేయమొదలిడెను. అల్లరి మాని ఇతరులతో సరిగా నుండుట అతనికి సమ్మతమగువరకును బయటనే యుండవలెనని అతడు వరాండాలోనికి పంపబడెను. అతడు వరాండాలో కొంతసేపుండి తిరిగి ఆటగది లోనికివచ్చెను. మధ్యాహ్న భోజనసమయమపుడు నేనా వరాండాలోనికి వచ్చి చూడగా చిలుక పంజరము తెరచియుండెను. చిలుక యెగిరిపోయెను. అది యెట్లుజరిగెనని యాలోచింపగా ఆ పిల్లవానిని వరాండాలోనికి పంపినపుడు అతడు బీరువాపై కెక్కి బాల్య కుతూహలముచే పంజరపు తలుపును తెరచెనని నాకెరుకయయ్యెను. పంజరపు తలుపును తెరచినచో పక్షి ఎగిరిపోవుననెడి జ్ఞానము ఆ చిన్నవానికి లేదు. పిల్లవానివయస్సును, ఆతడుండిన పరిస్థితులను ఆలోచించి చూచినచో చేసినతప్పిదము బుద్ధి పూర్వకము కాదని నిశ్చయముగా తెలియుచున్నది. కాని అది బుద్ధిపూర్వకమైనను కాకున్నను ఫలితము పిట్ట ఎగిరి పోవుటయే గదా! ఆపనిచేసినదా పిల్లవాడేయని నాకు నిశ్చయమయ్యెను. కనుక, మరునాడతడు బడికిరాగానే, "గోవిందా! నిన్న నీవా పంజరపుతలుపునేల తెరచితివని, అతడు తెరచినసంగతి నాకు తెలిసినరీతిగనడిగితిని. "ఎందులకో" అని అతడేదో అనబోయి ఊరకుండెను. నేనాశించిన జవాబును అంతే. అతడే ఆపనిని చేసెనని ఋజువైనదిగాదా. పంజరమును తెరచినది చిలుకను వదలవలెననెడి యుద్దేశముతో కాదనిగూడ తెలియుచున్నది. ఆ చెప్పలేని కారణమేదో చెప్పుమని నిర్బంధింపక, దానినెట్లుతెరచితివని యడిగితిని. తెరచినదినీవేనా? యని సందేహముతో నడిగినను, అడుగునపుడు ఉద్రేకమును జూపినను, బిడ్డభయపడి, అబద్ధమాడవచ్చును. అందుచే ఏయుద్రేకమును జూపక నిశ్చయభావముతో నడుగుటకే నే ముందుగ జాగ్రత్తపడితిని. అతడు నన్ను తనతో పంజరము కడకు గొనిపోయి తానా పంజరము నెట్లు తెరచినదియు నాకు చూపెను. అది నేననుకొన్న విధమేఐయుండెను. "అది పిల్లలాడుకొనెడి పక్షి. దానిని నీ వెగిరిపోనిచ్చితివి. వారికి వేరొక పక్షి నీయగోరెదవా?" అని నేనడిగితిని. "ఓ తప్పక ఈయగోరెదనని" యతడనెను. "నీవుబడికి వచ్చునపుడు నాయననీకేమైన కొని తినుటకని జేబుడబ్బునిచ్చునా? క్రొత్తపక్షిని కొనుటకై ఒకవారము డబ్బులన్నిటినాకిత్తువా?" అనియడిగితిని. దానికతడు సమ్మతించెను. అతని తండ్రి మధ్యాహ్న భోజనసమయమునకు బడికిరాగానే జరిగిన విషయమునంతను అతనికి జెప్పితిని. ప్రతిదినమును ఆపిల్లవాడు తిను బండారములను కొనుట మాని తనకిచ్చిన డబ్బులను నాకిచ్చుచుండెను. ఆ

యిచ్చినందులకు ఇంటివద్ద అతడేమియు బాధించుట లేదనియు, తిను బండారముల అంగడిని దాటిపోవునపుడెల్ల "ఈ నాడు నాకు చాకులెట్టు లేదు" అని మాత్రము అనుకొనుచుండెననియు తండ్రి నాతో చెప్పెను. ఒకవారమిట్లుగడచెను. అంత కాలమూ చిన్న బిడ్డడు తనకిచ్చినడబ్బుతోనేమియు కొని తినక దానిని, పక్షినికొనుటకై ప్రతిదినమును నాకిచ్చుచుండుట చాల గొప్పవిషయమే. ఆ చేసిన త్యాగము చాలును. అటుపైనింకను చేయుమనుట సమంజసము గాదు. అదియునుగాక కాలము సాగినకొలది అతడు తనతప్పేదోగూడ మరువగలడు.

ఇట ముఖ్యముగా గమనింపనగు సంగతి ఒకటి యున్నది. భయపడినచో ఆ బిడ్డడబద్ధమాడగలడని అతనికి భయముకలుగకుండ జాగ్రత్తపడితినని చెప్పితిని. పెద్దవారు తరచుగ పిల్లలను "ఏమిరా, ఇది నీవేనా చేసిన"దని కోపముతో గద్దించియడుగుచుందురు. అట్లడుగుటచే విషయము విశేష క్లిష్టమగును. స్వరక్షణకై బిడ్డ అసలు తప్పున కదనముగా నొకయబద్ధమునుగూడ ఆడగలడు. తప్పుచేసిన దెవరో నిశ్చయముగా తెలిసినప్పుడు ఆతప్పుచేసినది నీవేనా? యని వేరుగా నడుగరాదు. ఆపని నెందులకు చేసితివి? ఎట్లుచేసెనని బుజావు చేసికొనవచ్చును. ఎట్లడుగవలెనో ఏమడుగవలెనో, బాగుగ యాలోచించుకొనిగాని బిడ్డనడుగ మొదలిడరాదు. ప్రశాంతచిత్తముతో కారణయుతముగా నడుగగలప్పుడే అడుగవలెను. అట్లడుగుటచే బిడ్డ సహకారమును బడయుట సులభమగును. కోపముతో ప్రశ్నించుటకు మొదలిడితిమేని బిడ్డసరియగు సమాధానములనీయక ప్రతిఘటించుటకే ప్రయత్నించును. క్రమశిక్షణకు ఏడ్పును, కోపమును సన్నాహములు కానక్కరలేదు. అవిలేకయే అదిసాగగలదు.

### క్రమశిక్షణ యవసరమైనప్పుడాలోచింపవలసిన అంశములు :—

క్రమశిక్షణ ప్రయోజనకరము కావలెననిన పై జెప్పిన అంశములనే గాక ఇంకను కొన్నిటిని గమనించుట యవసరము.

(1) తన్నెందులకు దండించిరదియు బిడ్డకు తెలియవలెను. అతఁడేదో చేసినదానికి పెద్దలు తటాలున అలుక జెంది చరించుటయు, అదియెందులకో తెలియక బిడ్డ దిగ్భ్రమ జెందుటయు, తరచుగా తటస్థించుచుండును. తాను చేసినపని నెందులకు చేయరాదో, చేసిన నేమితప్పో, బిడ్డకు తెలియదు. బిడ్డయు అలుక జెంది ఎదురింప ప్రయత్నించును.

(2) చిన్నబిడ్డను అతని తొలితప్పునకై శిక్షింప ప్రయత్నింపరాదు. అది తప్పని అతనికి తెలియకపోవచ్చును. చేయరానిది చేసినపుడు తప్పేదో తెలియబరచి, ఒప్పును వీలైనా చేసిచూపవలెను. అప్పుడే అతడనుభవపూర్వకముగ విషయమును గ్రహింపగలడు.

(3) దండనలు తక్కువగుకొలది వాని ప్రయోజన ఫలితమెక్కువగును. తల్లిదండ్రులు సరియైన వారగుకొలదియు దండనలును అరుదగును.

(4) శిక్షణ సార్థకము కావలెననినచో దానిని తక్షణమే అమలు జరుపవలెను. అతి చిన్న పిల్లల విషయములోనిది మరియు ముఖ్యము. ఇట్లనుటచే తొందరపడియు, ఉద్రేకపడియు, శిక్షింపవలెనని తలంపరాదు.

(5) చేసినతప్పునకు బిడ్డను శిక్షించినపిదప మరిదాని ప్రసంగము నెత్తుకొనరాదు. పూర్వము చేసిన తప్పులను మాటిమాటికి జ్ఞప్తికిదెచ్చుటకంటె చెడుగైనది బిడ్డకు మరియొకటిలేదు. అతని తప్పులనుగూర్చి అతని ముందరనే కుటుంబమందలి ఇతరవ్యక్తులతోను, తెలియని పరాయివారితోను ముచ్చటించుట క్షమింపరాని తప్పు. బిడ్డ ఆత్మగౌరవమును తగ్గించెడిపనిని దేనిని మనము చేయరాదు. అట్లుచేసినచో ఆతడలుక జెంది చిరచిరలాడుటయు, ఎదురించుటయు, అవాంఛనీయములగు నితరవిధముల ప్రవర్తించుటయు తప్పక జరుగును.

—o—

# రామరాజ్యంలో

## (భరతుని దూరదృష్టి)

శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి



ఒకనాటి రాత్రి శ్రీరామచంద్రుడు రాచకార్యాలన్నీ నిర్వర్తించుకుని ఆ తొందరలో పొరబాటున భరతుని శయనమందిరంలోకి పోయి హంస తూలికాతల్పం మీద మేను వాల్చాడు. మేను వాల్చాడో లేదో బాగా అలసిపోయిన కారణంగా కాబోలును-మరుక్షణంలో గాఢంగా నిద్ర పట్టేసింది.

కొద్దిక్షణాలు గడచిపోయాయి. భరతుని భార్య మామూలుగా భోజనాదులు ముగించుకుని శయనాగారంలోకి వచ్చింది. ప్రక్క మీద పరున్న రాముని చూచింది రాముడును భరతుడును నీలమేఘ శరీరులగుటవల్ల ఆమె, అతన్ని శ్రీరామచంద్రునిగా గుర్తించలేక పోయింది. తన భర్తయే అనుకుంది. రాచకార్యాలకారణంగా అలసిపోయి త్వరగా పరున్నారు కాబోలునని భావించి, పతికి నిద్రాభంగం కలుగజేయకూడదని తలచి ఆశయ్యా మీదనే కాస్త ఎడంగా పరుంది. ప్రశాంత చిత్తమగు ఆమెకును మరుక్షణంలో నిద్ర వచ్చేసింది.

ఆనాడు శ్రీరామచంద్రుని ఆజ్ఞానువర్తియయిన, భరతుడు నగరపరిస్థితులను గమనించుటకు వెళ్ళి రాత్రి చాలా ప్రొద్దుబోయిన తరువాతవచ్చాడు. భోజనాదులు ముగించుకుని శయనాగారంవయిపు ఆవలించుకుంటూ నడిచాడు. తన శయ్యమీద తనభార్యప్రక్క మరో పురుషమూర్తి పరుండడంచూశాడు – ముందుగ అతనికాశ్చర్యం కల్గింది. కాని, లేశమాత్రమయిన కోపంరాలేదు. దూరదృష్టి సంపన్నుడగు భరతుడు జాగ్రత్తగా ఆలోచించసాగాడు "నా అన్నగారు, రాచకార్యభారంచే పొరబాటునవచ్చి పరున్నాడు. మేమిద్దరం ఒకే ఛాయగలవారమగుటచే నా భార్యయు నేనే ననుకుని,నిద్రాభంగం కల్గించరాదని దూరంగా పరున్నది. ఇందుకు వారిద్వరు నిర్దోషులే'' అని ఆలోచిస్తూ యీ విషయాన్ని ఎవరయినా చూస్తే అపకీర్తి నిర్దోషులగు తన భార్యకు, పవిత్ర నిర్మల హృదయుడగు తన సోదరునకు కల్గునని భయంతో – తన శయన మందిరద్వారందగ్గఱ ఆ రాత్రి తెల్లవార్లూ

పహారాకాయ నిశ్చయించి నిశ్శబ్దంగా ద్వారం దగ్గర నిలబడిపోయాడు.

వైతాళికుల మధుర గానాలాపనతో తెల్లవారింది. మాండవి లేచి భర్తపాదాలకు వందనం చేసి వెళ్ళిపోయింది. ద్వారం దగ్గర నిలబడ్డ భరతుడు మందస్మితం చేసి వెళ్తున్న ఆమెకు కనబడకుండా ప్రక్కకు తప్పుకున్నాడు. మరి నాల్గయిదు నిముషాల్లో శ్రీరామచంద్రుడు లేచాడు. లేచీ లేవడంతోనే అతనికి ఆశ్చర్యం కల్గింది. అది తనగది కాదు. కాని శ్రీరామచంద్రుడు మాటాడకుండా ద్వారం దగ్గరకొచ్చేసరికి పహారా యిస్తున్న భరతుడు చాటుకి తప్పుకోవడం గమనించి, శ్రీరామచంద్రుడు అతన్ని చూడనట్లు నటించి తనలో నవ్వుకుంటూ జరిగిన పొరబాటును, భరతుడు యిచ్చిన పహారా సంబంధమయిన విషయాన్ని భావించుకుని అత్యంతానందితుడయ్యాడు.

పూర్తిగా తెల్లవారిపోయింది. ఎవరి కార్యకలాపాల్లో వారు నిమగ్నులయిపోయారు. ఈ సంగతి భరతునికి తప్ప ఎవరికి తెలియదు. రాఘవేంద్రునికి కూడా తెలియదని భరతుని అభిప్రాయం. భరతుడు మాట్లాడకుండ ఊరుకున్నాడు. కాని శ్రీరామచంద్రుడు - సాక్షాత్ ధర్మస్వరూపుడు - ఊరుకోలేక - కులగురువగు వశిష్ఠ మహర్షితో యావద్వృత్తాంతం చెప్పేశాడు. వశిష్టమహర్షి శాస్త్రాలు తిరగవేశాడు. "రాముడు రాజ కదా! ఈ విషయం ఎవరికి తెలియదు కదా! శిక్షించకపోతే ఏం"? అని ఆ గురుశ్రేష్ఠుడు ఆలోచించలేదు. వశిష్ఠమహర్షి శ్రీరామచంద్రునితో పల్కాడు "రామచంద్రా! ధర్మస్వరూపుడవగు నీకు వేరుగ చెప్పబని లేదు. అయినా, నాధర్మం కనుక చెప్పుతున్నాను. తప్పనేది తెలిసి చేసినా, తెలియక చేసినా అది దోషమే. తెలిసి అయినా తెలియకయినా నిప్పుమీద కాలు వేస్తే కాలుతుంది గనుక దాని ఫలితం అనుభవించవలసిందే కనుక నువ్వు ఒకవారం రోజులపాటు నిరశనవ్రతం చేసి పశ్చాత్తాపాన్ని పొందు" అని ఆజ్ఞాపించాడు. రాముడు "చిత్తం" అని ఆజ్ఞను పాలించాడు.

# స్త్రీలు అబలలు కాదు

(ఎలినార్ రూజ్వెల్టు)

---

స్త్రీలకు మహత్తరమైన సముష్టిలక్ష్యం ఒకటి ఉన్నది. యావత్ప్రపంచంలో కలసిమెలసి పనిచేయగల అవకాశాల అన్వేషణకు వారు ఉపక్రమించారు. ప్రతి చిన్న యంత్రాన్ని, శక్తిని వినియోగించుకోవటానికి పురోగమించాలి. స్వేచ్ఛా ప్రపంచంవైపుకు సాగిపోవాలి.

ఇందులో ప్రధానమైన బాధ్యత పురుషులే వహిస్తున్నారనే సత్యాన్నికూడా మనం గుర్తించవలసి ఉంటుంది. ఈ నాడు మనం ఇంకా స్వేచ్ఛా ప్రపంచంవైపు పురోగమించటానికి అవసరకృషిచేయగలిగినటువంటి అధికార పదవులలో నేడు ప్రపంచంలో ఏభాగంలోనైనా కొలదిమంది మాత్రమే స్త్రీలు ఉన్నారు.

కాబట్టి మనం స్త్రీలుగా దాదాపు సర్వవిషయాలలోనూ పురుషులను నడిపిస్తున్నామనే విషయాన్ని గుర్తించాలి. మనం వారికి ధైర్యాన్నిస్తున్నాము. అంటే వారికి అండగా ఉండి వారు కార్యోన్ముఖులు కావటానికి ఇచ్ఛగించని వ్యవహారాలలో, వారి వెనుకఉన్న స్త్రీశక్తి మహత్తరమైన ఆధ్యాత్మిక శక్తి అనే భావన వారిలో ప్రేరేపించి ముందుకు నడిపిస్తున్నాము. స్త్రీలు పురుషులతోనే కృషిరంగంలో ముందుకు వస్తున్నారు. అక్కడక్కడ కొద్దిమంది స్త్రీలు మాత్రమే ముఖ్యమైన అధికార పదవులలో ప్రవేశించగలిగారు. ప్రపంచంలో వివిధప్రాంతాలలో రాజ్యాంగ బాధ్యతలు స్వీకరించి, ప్రభుత్వాల నిర్ణయాలు, విధానాలు రూపొందించటంలో ప్రముఖ పాత్ర నిర్వహిస్తున్నారు. వారు అధికారపదవులలోఉన్నా, లేకపోయినా వారికి ప్రాబల్యం అంతగా లేనటువంటి ప్రాంతాలలో సైతం స్త్రీ శక్తి మహత్తరమైంది. కాగా ఎవ్వరూ అర్థంచేసికోలేనటువంటి అధికారం స్త్రీలు గృహాలలో అనుభవిస్తున్నారు.

స్త్రీలకు తమదైనందిన బాధ్యతల విషయంలో మరింత విశ్వాసం కలిగించే నిమిత్తం మనం ఎంతో చేయవలసి ఉంటుందని నా అభిమతం. అందుకుగాను మనమంతా మన సమిష్టి లక్ష్యసాధనకు స్త్రీ జనాలను ఆదుకోవాలి. ఏదేశస్తులైనా సరే ఈ లక్ష్యసాధనకు నాయకత్వం వహించి, కృషి సాగిస్తున్నవారి బలం, అండదండలు మనం అపేక్షిస్తున్నాము.

ఈ నాడు మనం మన భావి ఆలోచనలకు ఉద్వేగాన్ని జోడించాలి. అదే ఈ నాడు అన్నిటికంటే ముఖ్యం.

ఐక్యరాజ్యసమితి నిర్మాణమైన తొలిరోజుల్లో మన ఆశయాలు సత్వరంగా నెరవేరగలవని మనలో చాలామంది భావించాము. మనకు తెలును, ప్రణాళికపై సంతకాలు చేసేటప్పుడు, కొన్ని లక్ష్యాలను సాధించేటందుకు అవసర కార్యక్రమం ప్రారంభించినప్పుడు — ఈ లక్ష్యాలు అంత ఇప్పటి కప్పుడే సిద్ధించేవికావని. అయితే ఏఓటా ఎంత నిర్ణీతకృషి సాధించగలమో, స్వల్ప విజయాలు సాధించినప్పటికీ ఎంతటి ధైర్యాన్ని ప్రదర్శించగలమో, అడుగువెంట అడుగు వేసుకొంటూ — కొందరకు ఎన్ని కష్టాలు ఎదురైనప్పటికీ కార్యదీక్షతో, పట్టువిడువకుండా ముందుకుసాగిపోగలమో మనలో ఎందరో గుర్తించి ఉండకపోవచ్చు.

వినాశనానికి బదులు మానవజాతి విమోచనానికి మనం సాగిస్తున్న మహత్తర కృషిలో ప్రతి ఒక్కరూ — అందరిపట్ల తమ తమ బాధ్యతలను గుర్తించటమే ఈ నాడు ప్రతిచోటా మనం నిర్వహించవలసిన కార్యక్రమం అని నా అభిమతం. ఇదొక బృహత్తర బాధ్యత.

అట్టి బాధ్యతలను నిర్వహించాలంటే మనం వ్యక్తిగతంగా చేయగలిగిన దానికంటే అధికారంలోఉండి

చేయగలిగేది హెచ్చుగా ఉంటుంది. మన బృందాలలో, మనలో మనం — మన శక్తులుగాక వెలుపల సహాయంకొరకు తరచుగా అభ్యర్థిస్తున్నాము. మనం నేర్చుకోబోతున్నాము. జీవితపర్యంతం కృషిచేస్తాము. అప్పుడప్పుడు చేసేకృషి కాదు ఇది. యావజ్జీవితం చేసేకృషి. కారణం, మన ఆశయం మహత్తరమైంది.

మన తరం అద్భుతమైంది. ఈ తరంలో మంచికీ, చెడుకూ మహదవకాశాలు ఉన్నవి. మనుష్యుల్ని గురించి ఆలోచించేవాళ్లు ఉన్నారు. ఆందోళనచెందేవాళ్లు ఉన్నారు. భవిష్యత్తును అవలోకించేవాళ్లు ఉన్నారు. అందుకు కారణం వాళ్లకు భావిపౌరుల (బాలలు)పట్లగల అవ్యాజప్రేమ. ప్రపంచంలో ప్రతి స్త్రీ దీన్ని గురించి ఆలోచిస్తుంది. బహుశా పురుషునికంటే అదనంగా ఆలోచిస్తుంది. ప్రపంచం ఎట్లా పురోగమించాలి అనే అంతిమ నిర్ణయం విషయంలో అతడు అధికంగా శ్రమిస్తాడు.

తమకు మనుగడ నిచ్చినదేశాన్ని — తాము న్న ప్రపంచాన్ని పురుషులు ఏవిధంగా రూపొందిస్తున్నారో స్పష్టంగా అవలోకిస్తూ వారి నిర్ణయాలు, తమ పథకాల స్వరూపాలేవన్న విషయం స్త్రీలు మరచిపోరాదు. ఈ బాధ్యత మనది. మనం క్రియారూపంలో ఉంటాము. పరిస్థితులను స్పష్టంగా పరిశీలించాలి.

ఒక్కొక్కసారి కొందరంటూ ఉంటారు—పురుషులలో ఉన్నంత క్రియానురక్తి స్త్రీలలో లోపిస్తుంటుందని. అది సత్యదూరం. జీవితంలో ప్రతి చిన్న విషయంలోనూ స్త్రీకి సంబంధం ఉంటుంది. అందుచే వారు పూర్తిగా కర్మిష్ఠులు. స్త్రీలది సునిశితమేధ. చేతులుకాలిన తర్వాత ఆకులు పట్టుకోవటం వాళ్ల అభిమతంకాదు. చేతులు కాలకుండానే ముందు జాగ్రత్తలు అవసరమని స్త్రీలు అనుభవరీత్యా అంటూ ఉంటారు. అంటే స్త్రీలకు ముందుచూపు ఉంటుందన్నమాట. తర్వాత కార్యక్రమం ఏమిటనేది వాళ్లు ఎప్పుడూ ఆలోచిస్తూ ఉంటారు.

మనం వ్యక్తిగతంగా అభివృద్ధి కాగలిగితే, మన స్వచ్ఛంద సేవాసంస్థలను పెంచుకోగలిగితే, ప్రభుత్వాధికారాలలో ఉన్న మన స్త్రీలను మనం బలపరచుకోగలిగితే, భవిష్యత్తులో మన పిల్లల ఉజ్వల జీవితాలకు పనికివచ్చే ప్రధాన సమస్యల పరిష్కారానికి మన ప్రభుత్వాలను ప్రోత్సహించగలిగితే మన పలుకుబడి అప్రతిహతమౌతుంది.

ఇప్పుడు స్త్రీలు, కొన్ని సంప్రదాయాలలో పురాతనభావాలు కలిగినవారుగాక, ఆధునిక విషయాలను పరిష్కరించుకోవటంలో, తమ కొరకు, ప్రపంచ ప్రజలకొరకు నూతన మార్గాలను అన్వేషించటంలో సులిసూత్రంగా వ్యవహరించగలరని భావిస్తున్నాను.

మనలని ఆవరించిఉన్న భయాలనుంచిగూడా విముక్తులం కాగలమని నా అభిమతం. మనలను గురించి మనకు, లక్ష్యసాధనలో మన శక్తి సామర్థ్యాలను గురించి మనలోని విశ్వాసం బలపడగలదనిగూడా భావిస్తున్నాను. మీరు చేయగలమనుకున్న దానికంటే ఇంకాస్త ఎక్కువ చేయటానికి ప్రయత్నించనిదే మీరు సంతృప్తిచెందరనే విశ్వాసంగూడా నాకు ఉన్నది. ఆ విధంగా ప్రయత్నించాలని నా ప్రార్థన. తాము చెయ్యగలమనుకున్న దానికంటే పైన చెయ్యలేనివారు, తాము చేరుకోవాలనుకున్న లక్ష్యాన్ని చేరటం దుస్తరం. మీరు సాధించగలమనుకున్న దానికంటే ఇంకాస్త అదనం చేయటానికి ప్రయత్నించండి. మీ భవిష్యత్తును గురించి మీకు స్పష్టమైన దృష్టి, ఆలోచన ఉండాలని నేను ఆకాంక్షిస్తున్నాను. మీ ఆలోచన ఏవిధంగా ఉంటుందో — దాని సాధనకు మీలోని సాహసంగూడా అలాగే పనిచేస్తుంది.

# అబల మనస్సు

'హరిప్రియ'

కండక్టరు మూడుసార్లు పిలిచినా వినిపించలేదు. వెంకట్రావుకు. భుజంమీద తట్టి పిలిచినప్పుడుగాని తన పరధ్యానంనుంచి బయట బడలేకపోయాడు. ఇన్నిసార్లు పిలిచినా వినుపించుకోని తనపరధ్యానానికి సిగ్గుపడ్డాడు. తోటిప్రయాణీకులు తనను చూచి నవ్వుతున్నట్లు భావపడ్డాడు. టిక్కట్టు ఛార్జిపోను కండక్టరు ఇచ్చిన చిల్లర జేబులోవేసుకున్న తరువాత, ఇచ్చిన చిల్లర సరిగా వున్నదాలేదా అన్నశంక అతనిలోకలిగింది. తిరిగి లెక్క పెట్టడం అంత మందిలో చిన్నతనమనిపించింది వెంకట్రావుకు. కుదుపులు లేకుండా మెత్తగా పోతున్నది తారురోడ్డుమీద బస్సు. చల్లగాలికి మళ్ళీ ఆలోచనలో పడ్డాడు వెంకట్రావు.

సీతకు తానుచేసిన అపకారం భయంకరముగా గోచరించింది. వెంకట్రావు గుండెలో చెయ్యిపెట్టికెలికినట్లు బాధపడ్డాడు. దానికి కారణం తనకొఱకు ఆమెచేసినత్యాగం. తను ఆమెకు చేసిన ద్రోహం. తండ్రివలదని వారించిన ధిక్కరించి, చివరకు ఒప్పించి తనను వివాహమాడింది. నిజానికి తాను సీత స్థితికి తగడు. తండ్రిచనిపోతు ఆమె పేర ఇచ్చినయావదాస్థిని అతని పేర వ్రాసింది తన పేరున ఉండుట ఇష్టంలేక. అటువంటి సీతకు అతను చేసినద్రోహం భయంకరంగా గర్జించింది అతని చెవులలో. తనను దైవసమానంగా చూచిన సీతను నిర్దాక్షిణ్యంగాహింసించగాఇల్లువదలి వెళ్ళి మూడుమాసములైనది. ఇంత కాలంగా ఆమెపడ్డ మనోవేదనను ఊహించి అతని మనస్సు తల్లడిల్లింది. ఈ విషయంలో సీతతప్పులేదని ఈనాటికి గుర్తించాడు. అనేక చెడువ్యసనాలకులోనై డబ్బును నీళ్ళలాగా ఖర్చుపెడుతున్నందకు ఆమె చాలా దుఃఖించింది. ఆమె దుఃఖము అతని ధన వ్యయాన్నిగురించిగాదు అతని పరువు ప్రతిష్ఠలనుగురించి, ఆరోగ్యాన్నిగురించి. చెడుస్నేహాలు మానమనీ కాళ్ళ - వేళ్ళ బడి కన్నీరు - మున్నీరుగా విలపించింది. దాని ఫలితం అతడుతనలోనిమానవత్వాని మరుగుచేసుకొని ఆమెపై చెయి చేసుకొనే నీచస్థితిలోకి దిగజారినాడు. తల్లిని కొట్టునప్పుడు అడ్డువచ్చిన అభం – శుభం తెలియని ఎనిమిదేండ్లపసిబాలుడు బాబుమీద మంచీ _ చెడూ లేకుండా చెయ్యి చేసుకున్నాడు. ఆనాడే ఎవరితో చెప్పకుండా వెయ్యిరూపాయలతో ఇల్లువదిలి వెళ్ళి ఇప్పటికి మూడుమాసములు. గతమంతా కలలా కళ్ళకు కట్టినట్లు గోచరించింది వెంకట్రావుకు. వెచ్చటికన్నీరు చెతిమీద రాలు

వరకు తను ఏడుస్తున్నట్లు గుర్తించలేక పోయాడు వెంకట్రావు. తోటిప్రయాణీకులు చూచెదరని పైపంచతోతన ముఖాన్ని దాచుకున్నాడు. హృదయంలోని దుఃఖము అగ్ని పర్వతంలా బ్రద్దలైంది. ఏడ్పును ఆపుకోవడంలో అతనిముఖము అరుణార్ణవ మైంది.

ఊరు దగ్గరకు చేరుతున్నకొద్ది అతనిలో ఆరాటం హెచ్చింది. సీతకు తన ముఖ మెలా చూపడం! అని బాధపడ్డాడు. తనకు తానుగా ఇల్లు వదలివెళ్ళి తానై తిరిగి వస్తున్నాడు. భార్యా పిల్లలను చూడా లన్నకోర్కె అతనిలో బలపడింది. కాని అతని హృదయాన్ని అంతులేని అభి మానం ఆవరించుకొని యున్నది. తన రాకను ఊరిలోవారు ఎలా ఊహించు కుంటారో? అయినా తనదారాపుత్రులను చూడడానికి ఒకరి ఊహా-పోహలతో తన కేంపని అన్న భావన అతనిలో మెదలింది. ఇట్టి అనిశ్చయపరిస్థితిలో అతని మనస్సు డోలాయమానమైంది. భార్య పుత్రులపై మమకారం అతని అభిమానాన్ని అణ గార్చినవి. తెగని ఆలోచనలు తరుగకుండా వస్తున్నాయి. తాను దిగవలసినగ్రామం వచ్చింది. అది ఆగవలసినచోట బస్సు ఆగింది. వెంకట్రావు బస్సుదిగేప్రయత్నం చేయలేదుగదా! దిగవలెనా వద్దా అన్న సందేహం అతనిలో కలిగింది. కండక్టరు హెచ్చరిక కళ్ళెంలాపని చేసింది అతనిపై. బస్సుదిగి ఆలోచిస్తూనిలుచున్నాడు కొద్ది సేపు. కూలీ, కూలీ, అంటూ కుర్రవాళ్లు మూగేసరికి కదలకతప్పిందికాదు. మాసిన గుడ్డలసంచీతో వంచిన తల ఎత్తకుండా నడుస్తున్నాడు వెంకట్రావు. పరిచయంకల వారుకూడా అతని పరిస్థితిచూచి నాలుక చివరివరకువచ్చికూడా అతనిని పలుకరించ లేకపోయారు. వెంకట్రావురాక వీధిలో ఆడుకునేపిల్లలవలనముందుగా విన్న సీతను సంభ్రమాశ్చర్యాలు ముంచు కొచ్చినవి. ఆమె కళ్లలో ఆనందబాష్పాలు తొణికిస లాడినవి. ఆ సంతోషంలో ఆమెమోము దిరిశెనపువ్వుల ఎర్రబారింది. ఉప్పొంగు సంతోషంతో అతనిరాకను ఎదురుచూస్తు వాకిట్లోనిలుచున్నది. తల్లి చీర చెంగు పట్టుకొని బాబు నిలబడియున్నాడు. తండ్రి రాకచూడనే మూడు నెలల క్రిందటి దృశ్యం అతనిచిన్ని మనస్సులో మెదిలింది. కొద్దిగా కలవరపడ్డాడు దానిని ఊహించు కొని. దూరమునుంచి భార్యా పుత్రులను వాకిట్లోచూచి వెంకట్రావుకొద్దిగా కలవర పడినాడు సిగ్గుతోకృంగిపోతు ఇంటి అరుగు ఎక్కాడు. వెంకట్రావు ఆగమనాన్ని ఎంతో సంతోషంతో ఎదురుచూచిన సీత అతను ఇంటిలోకాలిడగానే, వెల్లువవలె ముంచుకొనివచ్చు దుఃఖముతో తనను క్షమించమని అతనికాళ్లపైబడి వేడింది. నిర్విణ్ణుడైనాడు వెంకట్రావు. ఎవరినైతే తాను తనను క్షమించమని కోరుదామను కొన్నాడో, ఆ వ్యక్తి తనక్షమాపణను కోరుచున్నది. అతని కనులు చెమ్మగిల్లినవి. తల్లిప్రక్కన నిలుచునివున్న బాబునిచూచి ఒక్కంత చలించాడు వెంకట్రావు. అబల మనస్సు అతనికి అర్థమయినది.

# సతీత్వము

శ్రీమతి వాజపేయయాజుల మహాలక్ష్మి

—X—

పతికి హితమగు వాక్కును బలుకుమమ్మ
పతి పదాబ్జములనుబట్టి వరలుమమ్మ
ధవునిఁ బూజించుటే కడుధర్మమమ్మ
సతికి నాథుకంటెను మిన్న జగతిఁగలదె?

సతికిఁ బతిపాదసేవయే చాలునమ్మ
సతికదియె యిహ పరమును స్వర్గమమ్మ
వెదకిచూచిన లేదెందు వేఱుత్రోవ
యింతకునుమించు గతియేది? పృథ్విలోన.

తల్లిదండ్రులప్రేమ కాంతాలలామ!
ముఖ్యమే కాని నాథునిఁబోలఁగలదె?
యొక్క పతిభక్తి భాగ్యశుభోదయంబు
లిచ్చు దీర్ఘాయువిచ్చు నీ పృథ్విలోన.

స్వర్గమనునది పుట్టిల్లు సరణినుండు
మోక్షమనునది మెట్టిన భూమి మనకు
యిందుఁగల తారతమ్యంబు తెలియఁగవలయుఁ
గాన మెట్టిన యింటిసౌఖ్యంబె స్థిరము.

తల్లిదండ్రుల సిరియెంతఁ దగిలియున్న
సోదరుల వర్గమెంతయుఁ జూచుచున్న
బంధుజాలంబు తనకెంత బలసియున్నఁ
దొయ్యలి! మగనితో సరితూఁగఁ గలరె?

సమయము గుర్తెఱింగిసఖి! సల్పుచునుండుము
నాథుసేవలన్
విమల మనోజ్ఞవైఖరిని విస్తృతకీర్తినిఁగాంచు
వట్లుగా
నమలిన భక్తితో దహృదయంబడి సేవలు
సేయుచుండుమా
కమలముఖిలలామలకుఁ గాంతునికన్నను మిన్న
యున్నదే?

పాతివ్రత్యముఁ గలిగిన
నాతికి నరచేతనుండు జ్ఞానజగంబుల్
ప్రీతిగఁ గొల్చిన బోటికి
ఖ్యాతియు భూతియుఁ గలుగు జగంబున నెందున్.
పతికి నెదురాడుటే పెద్ద ప్రజ్ఞయనుచు
ధిక్కరణసేయుచుండెడు తెలివిహీన
నరక కూపంబులోఁబడి నలుగకున్నె?
ధర్మమెడఁబాయఁ బోకుఁడో తరుణులార!
తల్లిదండ్రుల సేవయె తనయులకును
భర్తృపాదాబ్జ సేవయే వనితలకును
ధర్మమున కివి రెండు నేత్రద్వయంబ
టంచు మృగ్యమయ్యె జగాన నమ్మలార!
నాదు సేవయు గాదు మీ నాథుసేవఁ
జేసి తరియింపుఁడోయంచుఁ జెప్పలేదె?
బ్రహ్మకైవర్తమున భగవానుఁ డింతి
వర్గమునకెల్ల సతి ధర్మమార్గమెల్ల.

# ప్రగతియొక్క సవాలు

సామాజిక సిద్ధాంతములపై దేశ నిర్మాణము రెండవ పంచవర్ష ప్రణాళిక ముఖ్యోద్దేశము. ఈ ప్రణాళికయందు దేశముయొక్క అభివాంఛలు ఆకాంక్షలు మూర్తీభవించి ఉన్నాయి. ప్రాతిపదిక మరియు భారీ పరిశ్రమలకు, ఆహార మరియు వ్యవసాయ ఉత్పత్తుల పురోగతికి ఇది పూనుకొన్నది. ఇతోధిక దేశాదాయంతోబాటు ఉద్యోగావకాశాలను విస్తృతపరచి, వివిధ సంస్థల యొక్కయు, ప్రజల యొక్కయు సమస్యా పరిష్కారములకు కూడ పూనుకొని యున్నది. ఈవిధంగా వచ్చె సమస్యలన్నీ ప్రగతి మార్గంలో అనుభవించవలసిన కష్టాలే. దేశమును ఈ ఆశయములను సంసిద్ధింప జేయుటకు ప్రణాళికావసరములను అనుసరించి, త్యాగబుద్ధితో, సేవాపరతంత్రతతో జీవితమును ధారపోయుట—సవాలు.

ప్రగతి, అభ్యుదయానికై

**ప్రణాళిక** అమలులోనున్నది.

"దేశ పునర్నిర్మాణము ఒక గొప్ప విషయము. మనమీ మహత్కార్య భారమునకు పూనుకొంటిమి. దీనికి సంయుక్తోద్యమము ఒక్కటే కాదు—వీరోత్సాహములతో కూడిన సంయుక్తోద్యమమే అవసరము."

—జవహర్‌లాల్ నెహ్రూ





# ఆర్థికాభివృద్ధి

శ్రీ గాడేపల్లి శంకరం

అర్థంలేని ఆచారవ్యవహారాలకీ — అనవసరపు ఆడంబరాలకీ అప్పులు చేయకూడదు. అప్పుచేసియైనా పప్పుకూడు తింటాములే అనే పద్ధతికి స్వస్తి చెప్పాలి. అభివృద్ధిమార్గాలున్నప్పుడు — వాటి పెట్టుబడికి అప్పు చేసినా తప్పులేదు. మంచి ఎద్దును కొనటానికి — మంచి విత్తులు నాటటానికి — బావి త్రవ్వించటానికి — పంపుసెట్టు పెట్టించుకోటానికి — ఏదైనా చిన్న గృహపరిశ్రమ ఆరంభించటానికి — అప్పుచేసినా తప్పులేదు కాని — వివాహాలకీ — వినోదాలకీ మూర్ఖపుటాచార వ్యవహారాలకీ అప్పులు చెయ్యకూడదు, ఉన్న దానితో సరిపెట్టుకోవాలి. 365 రోజులు పనిపాటలు కల్పించుకోవాలి — సోమరులై కూర్చో కూడదు — పండించిన సరుకును — సహకార పద్ధతిన సరసమైన ధరకు విక్రయించుకోవాలి — అప్పుతెచ్చిన ఆసాములకే అయినకాడికి అమ్ముకోకూడదు. అప్పులు చేయడం తప్పుకాదు. చేసిన అప్పును తీర్చేమార్గం కూడా అప్పుచేసేటప్పుడే ఆలోచించాలి. ఆ మార్గాన్ని అనుసరించాలి. ఈ నాడు పల్లె ప్రజలు అనుసరిస్తున్న ఆర్థిక విధానములు ఏమీ బాగులేవు. వారికి చేతినిండా పనిలేదు — చేసినపనికి తగిన గిరాకీ రాదు. ఖర్చులు తప్పటంలేదు కనుక అప్పులు చేస్తున్నారు. కోర్కలైతే విపరీతంగా పెరిగిపోయాయి — పట్నవాసపు నాగరికత కాస్తో కూస్తో పల్లెగ్రామాలకు కూడా ప్రాకుతోంది — అయితే ఆ కోరికలు తీర్చుకోనేదానికి డబ్బులేదు. ఆ డబ్బుకోసం అప్పులు చేస్తున్నాడు — తీర్చుట మెలాగనే ఆలోచనలేదు. ఆ యేటికాయేడు ఆర్థికంగా కృంగిపోవడమే జరుగుతోంది.

పన్నులు తగ్గించి ప్రభుత్వం సహాయపడినా ప్రయోజనంలేదు — ఋణవిమోచన శాసనాలవల్ల రైతుకి సౌఖ్యంకలగటంలేదు. రైతుకి అత్యవసర పరిస్థితుల్లో డబ్బు కావలసివస్తుంది. ఆ డబ్బును సర్దుబాటుచేసే సహకార బాంకును ఏర్పాటు చెయ్యాలి. ఇది ప్రభుత్వము — ప్రజలుకలిసి చేసుకోవలసిన ఏర్పాటు — సాధారణ వడ్డీ వ్యాపారస్థుని బారినుండి రైతుని తప్పించటానికి ఇది ఒక్కటే మార్గం. కొనటానికి — అమ్మటానికి అప్పుతీసుకోటానికీ సహాయపడే బాంకులున్నప్పుడు — పల్లె ప్రజల ఆర్థికవిధానం బాగుపడుతుంది. ఆర్థికంగా అభివృద్ధిచెందటానికి అవకాశం వుంటుంది.

ప్రస్తుత విధానంలో వడ్డీ వ్యాపారస్థులు — రైతుకి అప్పు యిస్తున్నాడు — కాని అనవసరపు ఖర్చులకి యిస్తున్నాడు — అన్యాయమైన వడ్డీకి యిస్తున్నాడు — రైతు కృంగిపోయి — తన అడుగుజాడల్లో నడిచేపరిస్థితికి తీసుకొస్తున్నాడు. పత్రంలో వ్రాసిన వడ్డీకి పైగా పుచ్చుకునే వడ్డీకి సంబంధములేదు — అక్రమంగా సరుకు విక్రయం జరుగుతోంది — కష్టాలకీ కార్పణ్యాలకీ దారిదీస్తోంది. చేసిన అప్పుకి విపరీతపు వడ్డీలు — వింత వింత షరతులు — విడ్డూరమైన విధానాలు — తరతరాలుగా అప్పు మిగులవలసిందేగాని తీరటంలేదు.

ఇంట జరిగే కార్యాలు కూడబెట్టిన ధనంతో జరుగాలి. ప్రతిచిన్నవస్తువు డబ్బుపెట్టి కొనుక్కోవాలి. ధాన్యంపోసి కొనుక్కోకూడదు. ప్రతి ఖర్చునీ — రాబడినీ లెక్క వ్రాసుకోవాలి. ఒక పన్ను కట్టటానికిగాని — నీటిపన్ను చెల్లించటానికిగాని జేబులో

రూపాయిలు పోసుకొని పొరుగూరుకి పోయే అలవాటు తప్పించుకోవాలి. బాంకులో డబ్బుదాచుకోవడం నేర్చుకుంటే ఈ అలవాటు తప్పుతుంది. చెక్కుల ద్వారా వ్యవహారం నడిపించుకోవచ్చు. పల్లె ప్రజలకి ప్రమాదంవుండదు — ప్రభుత్వానికి బకాయిలుండవు. ప్రతి గ్రామంలోను సహకార బాంకు ఏర్పడాలి - ఆ గ్రామంలోవున్న వడ్డీ వ్యాపారస్థులనుకూడ కట్టుకునే బాంకును స్థాపించవచ్చును. హృదయపరివర్తన, రైతులయందు, ఋణదాతలయందు కలిగితే కాని, గవర్నమెంటువారు ఈ విషయంలో ఏమీ చేయలేరు. రిజర్వుబాంకు సహాయపడినా ప్రయోజనంవుండదు. శాసనాలవల్లా కోర్టులవల్లా ప్రయోజనం అసలేలేదు. అనవసరపు ఖర్చులకి అప్పుచేయకూడదనీ, నూతన విధానలలో వ్యవసాయంగాని — మరి యే యితర పరిశ్రమనుగాని సాగించాలనీ, చేసిన అప్పు తీర్చుకుందామనీ — రైతులకుండాలి — ఆర్థికసహాయంచేసి తద్వారా తాను ప్రతిఫలం పొందుదామని వడ్డీవ్యాపారస్థునికుండాలి — ఉభయత్రా ఈ సద్బుద్ధిలేనివాడు — ఆర్థికాభివృద్ధి జరుగదు — అప్పులుతీరవు — అభివృద్ధిమార్గాలు అనుసరించబడవు — గవర్నమెంటు నిర్ణయించిన వడ్డీ రేటుకి అప్పుయిచ్చేవాడూ వుండడు — పుచ్చుకునేవాడూ వుండడు — ఇద్దరూ దొంగలై వ్యవహరించటం చేతనే — రైతు ఋణగ్రస్థుడైపోతున్నాడు — వడ్డీ వ్యాపారస్థుడు — వడ్డీలకు వడ్డీకట్టి లాభాలు గుంజుకుంటున్నాడు.

సహకార బాంకులోతప్ప యితరత్రా అప్పుచేయకూడదు. పెట్టుబడులకీ — అభివృద్ధి కార్యక్రమాలకీ — వైద్యసహాయానికీ — పిల్లల విద్యామొదలైన అభివృద్ధి వ్యవహారాలకీతప్ప యితరమైన వాటికి అప్పుచేసి పప్పుకూడు తినకూడదు. అప్పులేనివాడే భాగ్యవంతుడు — అప్పుచేయడం మహా పాతకమన్నా తప్పులేదు. మెదడు నుపయోగించి, వళ్ళు దాచుకోకుండా కృషిచేసి నూతన ఫక్కీని, తక్కువ పెట్టుబడితో — సరియైనలాభం సంపాదించటం నేర్చుకోవాలి. సంసారం పొదుపుగా చేసుకోవాలి. సందర్భోచితంగా, కూడబెట్టిన సొమ్ములోనే వివాహాది శుభకార్యాలు — వినోద కాలక్షేపాలు చేసుకుంటూ వుండాలి.

దేశంలో విపరీతంగా జనాభా పెరిగిపోతోందని గోలపెట్టుతున్నారు. తల ఒక్కింటికి వచ్చే జాతీయ ఆదాయం చాలా తక్కువగా వుందంటున్నారు. రత్నగర్భయని పేరుబడసిన భారతదేశంలో దరిద్రానికి తావులేదు. ఈ నాటి దరిద్రం ప్రజలలో శ్రద్ధ తక్కువకావడంవల్లా, బద్ధకం పెరిగిపోవటంవల్లా ఏర్పడింది — కృషిచేసేవాడు అన్నమో రామచంద్రాయని ఏడుస్తున్నాడంటే — వాడి కృషికి తగిన ఫలితం రావటంలేదు. ఏ వ్యక్తికి తగిన కృషి ఆ వ్యక్తికి లభించటంలేదు. పరిస్థితులు అనుకూలంగా లేవు. కృషిచేయవలసినవాడు — కార్మికుడవుతున్నాడు. కార్మికుడు కావలసినవాడు — కలంబట్టుతున్నాడు. డాక్టరు అవాలని వున్నవాడు — ప్లీడరు, ప్రొఫెసరు కావలసినవాడు పొలిటీషియను, అవడం జరుగుతోంది. శ్రద్ధ తక్కువకావడం — బద్ధకం ప్రబలిపోవడం — ఏవ్యక్తికితగ్గపని, ఆ వ్యక్తికి లభించకపోవడం — ప్రకృతి ప్రసాదించిన సంపత్తిని వినియోగించుకొనే మార్గాలు తెలియకపోవడమే ప్రస్తుత దరిద్రానికి కారణంగాని, జనాభా ఎక్కువకావడం వల్లకాదేమో! ఒకడు సంపాదిస్తే అరడజను మంది కూర్చుని తింటున్నారు. ఆ సంపాదనైనా — సవ్యంగా జరుగటంలేదు — యుగధర్మానికి అనుగుణ్యంగా వుండటంలేదు — ఇక దేశంలో దరిద్రం పోకపోతే భాగ్యవంతులెలావస్తారు? జాతీయ ఆదాయాన్ని పంచేమార్గాలలోకూడా సవ్యమైన మార్పులు — చేర్పులు తీసుకురావాలి. భారీపరిశ్రమలు పెట్టవలనని చెప్పేవారే ఇంజనీర్లు — సాంకేతిక నిపుణులు తక్కువగా వున్నారని అంటున్నారు. నూటికి 75 పాళ్ళు జనాభా వ్యవసాయంమీద ఆధారపడి వుంది. ఆ వ్యవసాయమైనా సంవత్సరం పొడుగునా జరుగదు. కాలం వృథాపోతోంది. పనిచేసే కాలం

కొంచెము — కోరికలు మాత్రం అపరిమితం. ఈ స్వల్ప వ్యవధిలో చేసిన కృషికే సమస్త కోరికలు తీరాలంటే ఎట్లా? — తన ఇంటిలోని వారంతా బ్రతుకాలీ అంటే సాధ్యమా?

కోట్లకొలదీ జనాభాగల భారతదేశం పనిలేక ఏడుస్తూవుంటే, మానవుని తొలగించే భారీపరిశ్రమలు, యంత్రములు మనకి అనవసరమనిపిస్తోంది! యంత్రములను గృహపరిశ్రమలలో ఉపయోగించటం మంచిదేమో! తయారుచేసే వస్తువులలో నాజూకుతనాన్ని, పనితనాన్ని కనబరచటానికీ, శరీరశ్రమ తగ్గించటానికీ, వీలైన విధంగా యంత్రాన్ని ఉపయోగిస్తే బాధలేదు. ఒక్కడే ఒక నిమిషానికి ఒకవంద సరుకులు తయారుచెయ్యవలెంకాదు, మనకు కావలసింది — ఆ ఒక్కడే తను అవలంబించిన పనిలో యంత్రశక్తిని వినియోగించి — సరుకును నాణ్యంగాను, నాజూకుగాను తయారుచేయడం మనకి కావాలి. యంత్రంతో తయారైన సరకుకి ఏమీ తీసిపోకూడదు. ఇది పెద్దలు ఆలోచించి అమలు జరిగించవలసిన విషయం — రాట్నానికి బదులు అంబర్ చర్ఖాను అమలుపెట్టబోతున్నట్లే, అన్ని చేతిపరిశ్రమలలోను — యంత్రశక్తిని వినియోగించి మానవశక్తికి తోడ్పడే విధంగా మార్పుచేయడం జరిగితే, కోటానుకోట్ల ప్రజలకి చేతినిండా పని — కడుపునిండా తిండీ వుంటుంది. శరీరశ్రమ తగ్గుతుంది — పనితనం ఎక్కువవుతుంది — చేనేత పరిశ్రమలో — చెప్పులు కుట్టటంలో — చేతిగొడుగులు తయారుచేయడంలో — కంచుపాత్రలు, లోహపాత్రలు, పోతపొయ్యడంలో, కర్రసామానులు కొయ్యసామానులు తయారుచేయడంలో యంత్రశక్తిని వినియోగించటం ఎంతవరకూ అవసరమో ఆలోచించడం మంచిది. భారీపరిశ్రమలకంటే వెనువెంటనే గ్రామాలలో పనిని కల్పించే గృహపరిశ్రమలను ప్రవేశపెట్టడం అవసరం.

చేసిన కృషి ఫలితానికి సరియైన ధర గిట్టుబాటు కావడంకూడా చాలా అవసరం. ధర గిట్టుబాటు కాకపోతే వృద్ధికాదు. అవసరంలేని సరకుని తయారుచేసి ప్రయోజనంలేదు. కావలసిన సరుకులన్నే తయారుచేయాలి. ఏగ్రామంలో కావలసిన సరుకులు ఆ గ్రామంలోని ప్రజలే — స్వశక్తిమీద ఆధారపడి తయారుచేసుకుంటే — సుఖజీవనానికి దారితీస్తుంది కదా!

ఆ గ్రామపరిసరాల్లో లభ్యమయ్యే ప్రకృతి సంపదను వినియోగించే పరిశ్రమలనే ప్రోత్సహించి, సహకార పద్ధతులలో సరుకును రవాణాచేయించి, శ్రమకు తగిన ఫలితాన్ని పల్లెవాసులకి చేకూర్చితే — పట్టణములకన్నా పల్లెగ్రామాలే వాసయోగ్యంగాను, భాగ్యవంతముగాను విజ్ఞాన విలసితంగా వుంటాయనడానికి సందేహంలేదు.

# జర్మను కథలు - కబుర్లు

'జర్మన్ డాక్టరు'

---

## అబ్బాయి ఆశలు!

హాన్స్ నాన్న ఆ వూళ్లో పెద్ద వుద్యోగి. భాగ్యవంతుడుకూడా! హాన్స్ అంటే నాన్నకు ఎంతో ప్రాణం. వాడు ఏమడిగినా తటపటాయించక ఇస్తుండేవాడు. అబ్బాయికి స్కూలుకు వెళ్లాలసిన వయస్సు వచ్చింది. వాడిని బడికి పంపటానికి కావాలసిన ఏర్పాట్లన్నీ చేయబడ్డాయి. హాన్స్ ఈ సంగతంతా పసిగట్టాడు. "నాన్నా! బడి ఎంతో దూరంలోవుందే! అంత దూరం ఎలా నడవగలుగుతాను? కాళ్లు నొప్పి పుడితే ఆ బాధ ఎలా భరించగలుగుతాను? ఇంతకూ ఆ సంగతి ఆలోచించావా?" అని బిక్కమొహం వేసుకుని ఒకరోజున అడిగాడు. వాడిని ఈ బెడద నుంచి గట్టెక్కించాటానికి చిన్న సైకిలు కొనియిచ్చాడు. దాన్నిచూసి, హాన్స్ ఎంతో మురిసిపోయి కొన్నాళ్లు దానిమీద స్కూలుకి వెళ్లటానికి మొదలెట్టాడు. తరువాత హాన్స్ బుర్రలో ఏంతట్టిందో, సైకిలును నాన్నకి చూపెడుతూ "కొండమార్గంలో సైకిలుని త్రొక్కలేక వుక్కిరిబిక్కిరి అయిపోతున్నాను. సైకిలుకంటే గుర్రంమీద వెళ్లటం అన్ని విధాల మంచిది. ఏమంటావు నాన్నా?" అని తనకోరికని వెలిబుచ్చాడు. అబ్బాయి అడగటం, తాను లేదనటం ఏకోశానాలేదు! అంచేత ఒక చిన్న గుర్రాన్ని వాడికి కొనియిచ్చాడు. గుర్రాన్ని హాన్స్ కొన్నాళ్లు వాడుతూ ఆనందించాడు. కాని కొంతకాలమయ్యాక గుర్రంమీద వెళ్లటం వాడికినచ్చింది కాదు. "నాన్నా! ఈగుర్రం తొందరగా నడవదు. అంచేత స్కూలుకు ప్రతిరోజూ ఆలస్యంగా పోవాలసి వస్తున్నది. దాని కన్నా ఒక ఏరోప్లేను కొని యిస్తివా, ఎంతోబాగుంటుంది" అని తన మనసులోని కోరికను వాళ్లనాన్నకు తెలిపాడు.

హాన్స్ నాన్న వాడికోరికను తీర్చటానికి చిన్న ఏరోప్లేనుని తయారు చేయించి యిచ్చాడు. ఏరోప్లేనును, ఇతరవాహనాలకి మల్లె అదుపులో వుంచుకోటం అంత సులభమైనపని అయితేగా! ఒకరోజున ప్లేనులో ఎక్కిన హాన్స్, దాన్ని స్వాధీనంలో వుంచుకోలేక పోయాడు. ప్లేను క్రిందపడ్డది. ఆ ప్రమాదంలో హాన్స్ కాళ్లు రెండూ విరిగిపోయాయి. అంచేత మాసాల పర్యంతం ఆస్పత్రిలో వుండాలసి వచ్చింది. కాళ్ళకి కట్టిన కట్లకేసి కంగారుగా చూస్తూ "ఎంతకాలం ఇలా పడకమీద కదలక మెదలక పడుకోనివుండాలి?" అని

మంచంమీద తన ప్రక్కనే కూచునివున్న నాన్నను ప్రశ్నించాడు. ఏం సమాధానం చెప్పాలో నాన్నకి తెలియక వాడికేసి విచారంతో చూస్తూ కంటతడి పెట్టుకున్నాడు. అంతకన్నా మరేంచేయగలుగుతాడు, పాపం, వాళ్ళనాన్న, అలాటి క్లిష్టపరిస్థితుల్లో ?...

## ఎప్పుడూ బేరాలే !

జర్మన్ సోల్జరుకి మిలిటరీ మెడల్స్ అంటే ఎంతో గర్వం. ధైర్య సాహసాల్ని చూపెట్టే సైనికులకే అట్టి పథకాల్ని వాళ్ల చక్రవర్తి బహుమానంగా ఇచ్చి సత్కరించటం పరిపాటి.

యూదులు బేరసారాదుల్లో సిద్ధహస్తులు. యూదుల అబ్బాయి సైనికుడిగా చక్రవర్తిసేన చేరాడు. ఆ రోజుల్లో జరిగిన యుద్ధంలో ఆ అబ్బాయి చూపెట్టిన సాహసానికి చక్రవర్తి మెచ్చుకుని ఆ అబ్బాయికి మిలిటరీ పథకాన్ని బహుమానంగా ఇయ్యాలని నిశ్చయించుకున్నాడు. మిలిటరీ అధికారి ఆ అబ్బాయిని గౌరవించటానికి సమావేశపరచిన సభలో ఆ అబ్బాయిని పొగడుతూ, వానిని తన దగ్గరికి చేరదీస్తూ "మార్కస్ ! నువ్వు చూపిన సాహసకార్యానికి చక్రవర్తి సంతోషించారు. చక్రవర్తిగారు ఇయ్యదలచిన ఈ పథకాన్ని తీసుకుంటావా ? లేకపోతే దానికి బదులుగా నూరుమార్కులను రొఖ్ఖంగా పుచ్చుకుంటావా ?" అని ప్రశ్నించాడు.

ఆ అబ్బాయి ఏమాత్రం తటపటాయించకుండా "ఏమండీ అధికారిగారూ ! ఒక సంగతి చెప్పండి - ఆ పదకంవెల ఎంత వుంటుంది ? ఇలా సాహసించి అడిగినందుకు క్షమించాలి" అని అడిగాడు.

"అంతేగా ! దానివెల ఆ మొత్తానికి పైగా వుండదనుకుంటాను" అని మందహాసంచేస్తూ ఆయన అన్నాడు.

"అలా గయితే ఆ మెడల్ వెలను నాకిచ్చివేయండి. చక్రవర్తిగారు దానికోసం ఇయ్యదలచిన ఆ నూరు మార్కుల రొఖ్ఖాన్నికూడా ఇచ్చివేయండి. దాంతో ఈ సమస్య అతిసులభంగా తేల్చుకోవచ్చు" అని అదురూ బెదురూలేకుండా అందరి ముందరా అడిగాడు ఆ అబ్బాయి.

## చౌక బేరం

దూరదేశపు మనిషి ఒకాయన ఏదో పనిమీద ఆ వూరికి ఒక రోజున వచ్చాడు. తన పనిపాటలని చూసుకోటానికి ఒక గుర్రం కావాలసివచ్చింది. గుర్రాల్ని అద్దెకు ఇచ్చే మనిషి ఇంటికివచ్చి ఆ రోజుకు గుర్రాన్నొకదాన్ని అరువుకు ఇయ్యమని అడిగాడు. గుర్రాల ఆసామి

ఆవలిస్తే ప్రేగుల్ని లెక్కపెట్టే మనిషి. పరాయివాళ్లకి గుర్రాల్ని అద్దెకియ్యటం ఇష్టంలేదు. అలా ఇస్తే ఎన్నెన్నో గొడవలు రావచ్చు. ... అంచేత ఒక పని చేస్తే అన్నీ చక్కబడుతవని అనుకున్నాడు. అద్దె సంగతి ప్రస్తావించక, గుర్రం వెల ఇంతనీ, దాన్ని ఆయన ఆ పళాన చెల్లిస్తే ఆ రోజంతా నిరాక్షేపంగా గుర్రాన్ని వాడుకోవచ్చుననీ, గుర్రాన్ని తనకు తిరిగియిచ్చినప్పుడు, దానికేలోపం లేదని తెలుసుకున్నాక, ఆ మనిషి ఇచ్చిన సొమ్ముని తిరిగి వాపస్ చేయటానికి తనకే మాత్రం అభ్యంతరంలేదనీ గుర్రం యజమాని ఆయనతో అన్నాడు. పరాయి మనిషి ఈ షరతుకి ఒప్పుకుని, యజమాని కోరిన వెలని ఆయనికిచ్చేసి గుర్రాన్ని తీసుకుని వెళ్లి ఆ రోజంతా తను చూసుకోవాలసిన పనినంతా చూసుకున్నాడు. గుర్రానికిప్రమాదం లేదు పని ముగించుకున్నాక గుర్రాన్ని యజమానికి ఒప్పచెప్పాడు. యజమాని తటపటాయించక ఆ మనిషి ఇచ్చిన సొమ్మును ఆ క్షణాన్నే వాపసుచేసాడు. పరదేశి ఆ సొమ్ముని పుచ్చుకుని వెళ్లబోతున్నాడు. ఆయన్ని అమాంతంగా ఆటంకపరుస్తూ "మీరు వెళ్లటానికిముందు నా అద్దె ఇయ్యాలిగా! బహుశా మీరు ఆ సంగతి మరచిపోయి వుంటారు. అద్దె ఇరవై మార్కులు మాత్రమే. దాన్ని ఇచ్చి మరీ వెళ్లండి" అని అన్నాడు.

పరదేశి ఆ మాటకి నవ్వుతూ "నువ్వు చెప్పేది బాగానేవుంది! గుర్రం నాది. డబ్బిచ్చి తీసుకున్న నా గుర్రం కోసం అద్దె నిచ్చుకోవాలా? ఇలాటి పేచీలు నసీమిరా నాకు నచ్చవు" అంటూ తిన్నగా తన దోవన వెళ్లిపోయాడు.

## మాటకి మాట!

రాజుగారికి ఒక రోజున మంత్రి మొహాన్ని చూశాడో లేదో, పిచ్చికోపం వచ్చింది. మంత్రి మొహం గుడ్లగూబ మొహానికన్నా అధ్వాన్నంగావుందని ఆ కోపంలో మంత్రితో అనేశాడు. మంత్రి తనలో రేకెత్తిపోతూవున్న కోపాన్ని అణగద్రొక్కుకుంటూ వినయ విధేయతలను చూపెట్టుకొంటూ వున్నట్లు వేయాలసిన వేషాన్ని యథాతథంగా వేస్తూ "ఇదంతా ప్రభువులవారి సన్నిధిని వుండటంమూలాన అబ్బిన భాగ్యం" అని అంటూ తనపని పాటల్లో నిమగ్నుడైపోయాడు.

.......

# శ్రీ సాయి భక్తుల అనుభవములు



[స్వామి కేశవయ్యాజీ విభూది ప్రసాదములు ఆశీస్సులతో శారీరకంగా మానసికంగా స్వస్థత చెంది తృప్తితో భక్తులు వెల్లడించిన స్వీయానుభవములు దిగువ వివరించబడినవి]

తమ సలహాలననుసరించి శ్రీ సాయి బాబా నామమును నియమబద్ధముగా స్మరించి వారి కరుణా కటాక్షములకు పాత్రుడనైతిని. తమ జాబు మాలో ఆత్మశక్తిని పెంపొందజేసి ఉత్సాహమును పూరించినది. మా నాన్నగారికి మీరు పంపిన విభూతి ప్రసాదము కల్పతరువైనది. మీ దయ, భగవంతుని అండదండలు మాకు నిరంతరము లభ్యమయి మమ్ములను కాపాడుచుండుట మా అదృష్టము.

మా తల్లిగారికి చిన్నతనముననే కండ్లకలక వచ్చినది. శ్రీమంతుల బిడ్డయయి, గారాబము ఫలితముగా తగు చికిత్స, ఔషధసేవనముల నిర్లక్ష్యము చేయుటచే దృష్టిలోపము సంభవించకపోయినను క్రమంగా దుర్మాంసకండలు పెరిగి కనురెప్పలు వాలబడిపోయినవి. బాబా అనుగ్రహమువలన ఆమె చూపు చెడకుండా ఆమె కండ్లు బాగుపడులాగున కరుణించ ప్రార్థించుచున్నాను.

మా కుటుంబ ఆర్థికపురోభివృద్ధికి, మా గృహము శాంతి ఆనంద నిలయమగుటకు అనువగు సలహాల నీయవలసినదిగాను, మా తల్లిదండ్రుల ఆరోగ్యాభివృద్ధిని, మా తండ్రిగారి ఉద్యోగ ధర్మములోని చిక్కులను విడిపోయి సరసమగునట్లును, కుటుంబగౌరవ ప్రతిష్ఠలతోబాటు సౌభాగ్యము పెంపొందునట్లుగా అనుగ్రహించవలసినదిగా కోరుచున్నాము.

♦ ♦ ♦

మా మనుమరాలు గతంలో అజీర్ణము, మూర్ఛలతో బాధపడుచుండి, మీరు ప్రసాదించిన రక్షతో పూర్తిగా స్వస్థత చెందినది. కొన్ని నెలల క్రిందట దాని నామె పోగొట్టుకున్నది. అప్పటినుండి ఆమె ఆరోగ్యము తృప్తికరముగా లేదు. దయయుంచి ఆమెకు మరొక రక్షను ప్రసాదించుచు, బాబా విభూతి ప్రసాదములను పంపవలసినదిగా ప్రార్థించుచున్నాను.

♦ ♦ ♦

తమ అమూల్యమైన సలహాలననుసరించి 'శ్రీ సాయిరాం' నామ జపమును నియమబద్ధముగా చేసి స్థానికోన్నత పాఠశాలలో నుద్యోగము సంపాదించినాను. నా భార్య ఆడశిశువును కని తల్లి, బిడ్డ ఆరోగ్యముగానున్నారు. నేనింకా 48 దినములు ప్రతిదినము 108 సార్లు 'శ్రీ సాయిరాం' నామజపమును పూనుకున్నాను. మా పైన, మా కుటుంబము పైన తమ యొక్క ఆశీస్సులను, శ్రీ బాబా యొక్క కరుణాకటాక్షములను ప్రసరించి బాబా విభూతి ప్రసాదములను పంపవలసినదిగా ప్రార్థించుచున్నాను.

♦ ♦ ♦

నేను 1955లో అనేక విధాల కృంగిపోయి కష్టదశలో నున్నపుడు మిమ్ములను శరణువేడగా ప్రతిదినము ఉదయము 108 సార్లు 'శ్రీ సాయి' నామము జపించవలసినదిగా ఆదేశించియుంటిరి. దానివలన శ్రీ సాయిబాబా కరుణాకటాక్షములతో స్వస్థత చెందినాను.

ప్రస్తుతము నా భార్య రక్తపోటు, ఇత్యాది ఆరోగ్యలోపములచే బాధపడుచున్నది. నా శక్త్యానుసారం అందుబాటులోని సుప్రసిద్ధ వైద్యులచే చికిత్స చేయించుచున్నను స్వస్థత సమకూరలేదు. ఆమె సుమారు 10 సంవత్సరములనుండి సాయిభక్తురాలై

(106-వ పేజి తరువాయి)

# భార్య

"శార్వాణి"





**(గత సంచిక తరువాయి)**

కమల నవ్వుతూ అచ్చటనుంచి లేచి, వంటింట్లోకి వెళ్ళి ఖాళీడబ్బాను తీసుకొనివచ్చింది.

"నిన్నిచ్చట దయదలచివుంచినందుకు, నీ యిష్ట మొచ్చినట్లు వాగుతున్నావు. అతను వచ్చిన తర్వాత, నీకు నీవే నా కాళ్లమీదవచ్చి, క్షమించమని బ్రతిమాలుకుంటావు"

"నా తప్పులుంటే యిప్పుడే క్షమించమని కోరుకుంటాను. తప్పులను ఆరోపించి, బ్రతిమాలించుకోవడం మీ కిష్టమైతే క్షమించమని అడగడానికి ఎవరి మనస్సు అంగీకరించదు."

"నీతో వాదించడానికిరాలేదు. మాటలతో నన్ను విసిగించదలచుకుంటే, అనవసరంగా తర్వాత బాధపడతావు."

"ఎవరు విసిగిస్తున్నది ప్రత్యక్షంగా నిరూపించబడుతూనేవుంది. అంత తేలిగ్గా తోటి స్త్రీ హృదయాన్ని కష్టపెట్టడంవల్ల సర్వనాశనాన్ని కోరుకుంటున్నట్లు కన్పిస్తుంది."

"నీ మాటలు నాకు అర్థంకావడంలేదనుకుంటున్నావు. భర్తను సుఖపెట్టలేని ఆడది, ఈ విధంగానే నీతులు చెప్తుంది. ఇంతవరకు నాశనమయిందెవరో ?"

"సుఖపెట్టకల్గుతున్నామని మాయోపాయాలు పన్ని, అనుబంధమైన మనస్సులను విడదీసి, చల్లని సంసారాలను చిచ్చుపెట్టడం నేర్చుకున్నవాళ్ళకు, నైతికనియమం, నీతినిజం ఏమి తెలుస్తుంది. ఇప్పటికైనా మించిపోయినదిలేదు. భగవంతుడు చూపుతున్న మంచిమార్గంవేపు ప్రయాణంచేస్తే, ధర్మం నిన్ను తప్పకుండా రక్షిస్తుంది."

"నోరుమ్మూస్తావా ? లేదా ? ఎక్కువ ప్రేలావంటే అతడు వచ్చిన తర్వాత మెడపట్టుకొని బయటకు గెంటిస్తాను."

"ఎంతకైనా సాహసిస్తావు. వారిలో హృదయదౌర్బల్యం వున్నంతవరకు దుర్మార్గాన్ని చేయడానికి వెనుకంజవేయవు. నిన్ను స్త్రీగా పుట్టించినందుకు, సమాజంలో స్త్రీగౌరవాన్ని మంటగలుపుతున్నావు" కమల అచ్చటనుంచి వెళ్ళిపోయింది. మోహిని చీరలన్నీ తీసుకొని, గదిలోనికివచ్చి చిందరవందరగా విసరగొట్టింది. వెంకట్రావు యింటికివచ్చేసరికి, తలవిరియబోసుకొని, ముఖం చిట్లించుకొని కూర్చుంది.

"ఈ ఇంట్లో అదైనా వుండాలి. నేనైనా వుండాలి. ముందు ఏ సంగతి తేల్చిచెప్పు." వెంకట్రావు నుద్దేశించి అడిగింది.

"అసలు సంగతి చెప్పకుండ తోకత్రొక్కిన త్రాచుపాములాగ బుసలుకొడితే ఎట్లా !" మంచం మీద చతికిలపడ్డాడు.

"నీ పెళ్ళాం, ఆ దెయ్యం తన నోటికివచ్చినట్లు వాగుతుంది. బట్టలు వుతికిపెట్టమంటే, నీకేమైనా దాసీనా, అంతగా అవసరముంటే నిన్ను తీసుకొని వచ్చినవారితో వుతికించుకోమని అంటోంది." అబద్ధాలు అల్లి, వున్నవి లేనివి ఏకరవుపెట్టి, అతనిని కన్విన్స్ చేయడానికి ప్రయత్నంచేసింది.

"ఆ రోజు నేనుచెప్తే విన్నావా ? నేను పంపిస్తుంటే నీవే కోరి యింట్లో పెట్టుకున్నావు."

"మనిషి చూడ్డానికి మెత్తగాకన్పిస్తే మంచిదనుకున్నాను. ఇట్లాగ నెత్తినెక్కుతుందన్న సంగతి తెలుసుంటే ఆ రోజే బయటకు గెంటించేదాన్ని."

వెంకట్రావు అచ్చటనుంచిలేచి, వసారాలోనికి వచ్చాడు. కమల చీరచిరుగులను కుడుతోంది. వెంకట్రావు రావడంచూచి, లేచినిలబడింది.

"ఆమెను నీ యిష్టమొచ్చినట్లు అనడానికి అధికార మెవరిచ్చారు?" ఆమెకు కొంచెం దగ్గరగా వచ్చి ఉద్వేగంతో అన్నాడు.

"నేనేమి అనలేదు." మెల్లగా అంది.

"అబద్ధాలుకూడా నేర్చుకున్నావన్నమాట. నీవు ఏమిఅనలేదూ." చంపమీద గట్టిగా కొట్టేసరికి, ఆమె తల వొంచుకొని నించుంది. అశ్రుకలుషితమైన ఆ ఎర్రని నేత్రాలను చూడలేక, వెనక్కితిరిగి వెళ్ళిపోయాడు.

"మోహినీ! ఈ సారికి ఆమెను క్షమించు. ఆమె వెళ్ళిపోతే నీవు వంటచేసుకోవాలి. వంటింట్లో నీవుంటే, పొగకు నీ ముఖం కందిపోతుంది. చేతులు బండబారిపోతాయి. ఇహనుంచి జాగ్రత్తగా వుంటుందిలే!"

కమల చిన్నసంచిని చేతిలోపెట్టుకొని, గుమ్మం దగ్గరకువచ్చి నిలబడింది.

"ఎక్కడికి బయలుదేరావు?"

"మీరు హృదయపూర్వకంగా కోరుకుంటున్న చోటుకి."

"సరిగా సమాధానంచెప్పు! ఎక్కడకు వెళ్లేది."

"మీ సుఖంకోసం, భగవంతుడ్ని ప్రార్థించడానికి అందరూ ఎచ్చటకు వెళ్తున్నారో అచ్చటికి."

"నన్ను విసిగించకు అర్థమయేటట్లు చెప్పు"

"మానవులలో మీకున్న మర్యాదను నిర్మూలించడం యిష్టంలేక."

"నీ వంటున్నది బోధపడటంలేదు"

"మంచి మనస్సుతో చూడగల్గితే అర్థమవుతుంది. అనుబంధమైన సంబంధం ఎంత నలిగిపోతుందో బోధపడుతుంది"

"నిన్నీ ఇంట్లో సరిగా చూడటంలేదంటావు."

"ఆ మాట మీరే అంటున్నారు. మీరు నన్ను సరిగా చూడటంలేదని నా నాలుక అంటే, మీరు దాన్ని ముక్కముక్కలుగా ఖండిస్తారు. మీరు అంటున్న నిజం జరగక పోయినా నేను ఆ విషయంలో మీ గౌరవాన్ని నిలబెట్టుటకు 'అబద్ధమాడవలసివుంది."

"నీకు మతిపోయింది. అర్థంలేని ప్రేలాపన."

"మనశ్శాంతిలేని జీవితంలో మీరు వూహించిన విషయం మీమనస్సు మంచిగా మారకపోతే తప్పకుండా జరుగుతుంది. క్షమించండి. నా అర్థంలేని ప్రేలాపనతో మిమ్మల్ని విసిగించకుండానే నన్ను మీరు కోరుకుంటున్న చోటుకి పంపించండి."

"నీవు ఎక్కడకు వెళ్లడానికి వీల్లేదు."

"మీరంటున్నది నిజం. నేను ఎక్కడికి వెళ్ళకూడదు, ఈ ఇంట్లోనేవుండాలి. మీపాదాల మీద పడి, సేవచేస్తూవుండాలి. కాని మీ గౌరవాన్ని మరొకరు మంట గలుపుతుంటే సహించను."

"అంటే మోహిని నిన్ను ఏమి అనకూడదంటావు?"

"ఆమెకు నాకు ఈ ప్రపంచంలో ఎటువంటి సంబంధంలేదు. నాస్థలాన్ని ఆమె ఒకవేళ బలవంతంగా ఆక్రమించుకున్నా అది కేవలం క్షణికం. ఆమె నన్నుదూషించినా, పరుషంగా పల్కినా నా సౌశీల్యాన్ని కించత్తుగూడా కళంకిత పరచలేదు. ఒకప్పుడు ఆమె మీ మనస్సును మార్చినప్పుడు ఆమె మీదగ్గర ఒక్కక్షణం వుండలేదు."

"మీరు మీరు ఏగంగలో దిగుతారో దిగండి కాని, నన్ను మాత్రం మీ మధ్య యిరికించవద్దు." మోహిని మధ్యలో గల్గచేసుకుంది.

"బాగా ఆలోచించు. ఒకసారి వెళ్ళిన తర్వాత మళ్లి నీకీ ఇంట్లో చోటులేదు. అప్పుడు కాళ్ల మీద పడి ఏడ్చినా ప్రయోజనంవుండదు."

"ఇప్పుడున్న కన్నీరుకు సమాధానంలేదు. మీ సుఖాలకు అడ్డుగా నిలబడటం నాకిష్టంలేదు."

"అయితే ఒక్క క్షణం ఈ ఇంట్లో వుండవొద్దు. వెంటనే ఇచ్చటనుంచి వెళ్ళిపో!

"మీ సుఖంకోసం వెళ్తున్నాను." అతనికి కడసారి నమస్కారంచేసి బయలుదేరింది. వీధి గుమ్మం దాటి వెళ్ళిన తర్వాత, వెనక్కి తిరిగి చూచింది. పొర్లివస్తున్న దుఃఖాన్ని లోపల దిగమ్రింగి ముందుకు నడిచింది. మళ్ళా వెనక్కి తిరిగి చూచింది. తలుపులు బంధించబడ్డాయి.

సంజె చీకటి అలుముకుంటోంది. ఆ చీకటిలో ఎచ్చటకు వెళ్ళాలి? దారి కన్పించడంలేదు. అంతా అగమ్యగోచరంగావుంది. రిక్షాకట్టించుకొని కనకదుర్గగుడికి బయలుదేరింది. రిక్షావాడికి డబ్బులిచ్చి, కొబ్బరికాయ, పసుపు కుంకుమ పువ్వులు తీసుకొని పైకి బయలుదేరింది. ఒక్కొక్క మెట్టుదాటుతూ, జరగబోయే ఉపద్రవాలను తలచుకుంటూ గుడిదగ్గరకు చేరుకుంది. ఆలోచనలన్నీ మరచిపోయి, భారమంతా కనకదుర్గతల్లిమీద మోపి సాష్టాంగదండప్రణామం చేసింది కుంకుమ నుదటను పెట్టుకొని, ప్రసాదం తీసుకొని, గుడిలోంచి బయటకువచ్చింది. మంటపంమీద కూర్చొని, దూరంగా అందకుండా వున్న చందమామవైపు చూస్తోంది. ఆమెకేమి అంతు చిక్కలేదు. లేచినిలబడింది. కాస్త ప్రసాదం తిని, పంపుదగ్గరకు వెళ్ళి మంచినీళ్లు కడుపునిండా త్రాగి ఆకలిని చంపుకుంది. పాలకొల్లు వెళ్ళే బళ్లు ఏమి లేవు. తెల్లవారుఝామున ఒకబండివుంది. పాలకొల్లు ఏ మొహం పెట్టుకొని వెళ్ళాలి? తల్లిదండ్రులకేమని చెప్తుంది? భర్త పెడుతున్న యిక్కట్లను చెప్పకుండావుంటే, భర్తను అగౌరవపరచడానికిచ్చటకు తయారయ్యావంటే, మళ్ళా తిరిగి బ్రతకగలవా? నిజం చెప్పేస్తే, చేతకాకవచ్చేసనని అమ్మ అంటే, నామనస్సెంత చివుక్కుమంటుంది? పాలకొల్లు వెళ్ళను. అయితే ఇంకెక్కడకు వెళ్ళాలి! దిక్కులేని అనాథ, భర్తచే అగౌరవింపబడిన భార్య ఎక్కడకు వెళ్తుంది? సమాధానం ఎవరుచెప్తారు.? ఎవరు చెప్పరు? ఎవరకి అవసరంలేదు. ఆడది నాశనం అయిపోతుంటే, ఎవరు పట్టించుకోరు. పైగా ఆమెను నాశనం చేయడానికి ప్రయత్నిస్తారు గాని.

గుడికి తాళాలువేసి పూజారులు వెళ్ళిపోతున్నారు. గుడిలో గంటలు విన్పించడంలేదు. కమల మల్లిఖార్జునస్వామి గుడిదగ్గర మెట్ల మీదుగా క్రిందకు దిగివచ్చింది. ఇందాకవచ్చిన రిక్షావాడు కాచుకొని కూర్చున్నాడు.

"అమ్మ బండికావాలా!" రిక్షాను ఆమెదగ్గరకు తీసుకొనివచ్చాడు. ఆమె బండిలో మాట్లాడకుండా ఎక్కికూర్చింది. రిక్షా, బస్సుస్టాండుదాటి, గవర్నరుపేట సెంటరు దగ్గరకువచ్చింది.

"ఎక్కడకు తీసుకొని వెళ్తున్నావు." ఆమె లోపల్నుంచి అడిగింది

"మీరిందాక ఎక్కిన యింటిదగ్గరకు" ఆమె ఉలిక్కిపడింది. రిక్షా సూర్యారావుపేటకు దారి తీస్తోంది. విజయటాకీసు దగ్గరకు వచ్చేసింది. మలుపు తిప్పాడు. కుడిచేతివైపుకి తిరిగాడు. పోస్టాఫీసు మొదటిసంధు తిరిగి, వెళ్ళుతున్నాడు. ఆమె శరీరం సిగ్గుతో భయంతో కంపించుకొనిపోతుంది. రిక్షాను వెనక్కి తిప్పమని అడగలేకపోతుంది.

"ఈ ఇంటిదగ్గర ఆపుచేయి." రిక్షాదిగింది. ఇల్లు తాళంవేసివుంది. రిక్షావాడికి డబ్బులిచ్చి, అరుగు మీదనవచ్చి కూర్చుంది.

"వంటరిగా చీకటిలో కూర్చున్నావు. ఎవరమ్మా నీవు" పక్కింటావిడ లాంతరు తీసుకొని బయటకువచ్చింది. కమల తల పైకెత్తి చూచింది.

"నీవా? మీ ఆయనతో యింతకుముందు వెళ్లింది నీవు కదూ! అయితే ఆ అమ్మాయి ఎవరు?" లాంతరువత్తి పెద్దదిచేసి, గట్టిగా ఆవులిస్తూ అంది. కమల కళ్ళను పమిటిచెంగుతో వొత్తుకుంటూ, ముఖాన్ని ఆమెకు కన్పించకుండా చేసింది.

"అర్థమయింది. ఈ మగవాళ్ళను నమ్మకూడదు. కట్టుకున్న యిల్లాలను యింత ఉసురుపెడుతున్నప్పుడు, తగిన ప్రాయశ్చిత్తం కాకుండా మానదు. ఎంతసేపని బయట నిలబడతావు వాళ్లు సినిమాకు వెళ్ళివుంటారు. మా ఇంట్లోకి రా !"

కమల ఆమె మాటలు విన్పించుకోలేదు. కదలకుండా అచ్చటే కూర్చుంది.

"ఎవరికర్మకు ఎవరు బాధ్యులు ?" కాస్సేపటి వరకుచూచి ఆమె లోపలికి వెళ్ళిపోయి, తలుపులు వేసేసుకుంది. కమలకు ఎక్కడలేని దుఃఖం వచ్చింది. వెక్కి వెక్కి ఏడ్చింది. ఆ చీకటిలో ఆమె కన్నీరు కన్పించనీయకుండా చేస్తోంది. ఆమె దుఃఖాన్ని కీచురాళ్లధ్వని మింగేస్తోంది.

పదిగంటలు దాటేసరికి, వాళ్ళిద్దరూ తిరిగి యింటికి వచ్చారు. అరుగుమీద కమల కన్పించింది. వెంకట్రావు తాళంతీసి, మోహిని లోపలకు వచ్చిన వెంటనే ధబేల్‌మని గడియవేశాడు. కమల తలుపులను తలబాదుకుంది. గడియతీయలేదు. కొంచెం సేపటికి కమల గుమ్మందగ్గర సొమ్మసిల్లిపడిపోయింది. అర్ధరాత్రి ఒకసారిలేచి తలుపులుతీసిచూశాడు. కమల ముఖంనిండా నెత్తురు. తలంతా చేగిపోయి వుంది. వెంట్రుకలు నెత్తురుతో చర్మానికి అంటిపెట్టుకునివున్నాయి. ఆమె ముఖంవంక చూశాడు. అతని వెనుక ఎవరో కొరడాతో కొట్టినట్లు ఫీలయ్యాడు. ఆమెను లేవదీసి లోపలకు తీసుకొని వచ్చాడు. నూతిలో నీళ్లుతోడి, ముఖమంతా కడిగి, చేతిలో నీళ్లుపోసుకొని వొసటమీద గట్టిగా జల్లాడు. ఆమె మెల్లగా కళ్లుతెరచి చూచింది. ఎదురుగుండా భర్త కన్పించేసరికి, అతని కాళ్ళను చుట్టేసుకొని ఏడ్చింది.

"నన్ను క్షమించి నన్నిచ్చటే వుండనివ్వండి." తలపైకెత్తి, మరియొకవైపుకి మొహంపెట్టి చూస్తున్న భర్తను బ్రతిమాలుకుంది. అంతలో మోహిని గదిలో నుంచి మేల్కొని అచ్చటకువచ్చి అతన్ని లోపలకు తీసుకొని వెళ్ళిపోయింది. కమల భర్త కన్పించేవరకు ఆశగా చూస్తూ, అచ్చటే ఒరిగిపోయింది. తెల్లవారిన తర్వాత వాకిలితుడవడం మొదలుకొని ఇంటి పనులన్నీ తనే చేసుకుంటుంది. వెంకట్రావు ఎనిమిదయినా లేవలేదు. కమల గదిలోనికి రాబోతే, మోహిని రానీయలేదు. వెంకట్రావుకి తీవ్రంగా జ్వరంవచ్చింది, వళ్లంతా కాలిపోతోంది. అతడు మూల్గుతున్నాడు. మోహిని తనకు కానట్లు, ఏదో పుస్తకం ముఖానికి అడ్డుగా పెట్టుకొని కూర్చుంది.

"మోహినీ ! నిన్నే ! డాక్టర్ని పిలువు. జ్వరం పేలిపోతుంటే నీకు తెలియడంలేదా ?"

"ఈ ఊళ్ళో నా కెవరు డాక్టర్లు తెలియరు. మామూలు జ్వరం, రెండు రోజుల్లో తగ్గిపోతుంది." నిర్లక్ష్యంగా మాట్లాడింది.

"పోనీ కాస్త కాఫీఅన్నా తెచ్చిపెట్టు. ఆకలి వేస్తుంది"

"కాస్త జ్వరంవస్తే చాలు ప్రాణాలు కొరుక్కు తింటావు. కాస్త లేచివెళ్ళి త్రాగకూడదూ."

"నీవు లేవకపోతే పోయావుగాని, కమల్ని ఒకసారి యిటుపిలు."

"దాన్ని పిలవడానికి నాకేమి అవసరం. అంతగా అవసరముంటే నీవే పిలుచుకో !"

ఈసారి వెంకట్రావుకి వళ్ళంతా కంపించుకొని పోయింది. కాని ఏమి అనలేకపోయాడు. అభిమానాన్ని చంపుకుని చవటలాగ చల్లగా వూరుకున్నాడు.

రెండు మూడు రోజులు దాటిపోయాయి. అతని జ్వరం తగ్గలేదు. మందులేదు, మాకులేదు. తనుసేవ చేయక, కమలనుకూడ గదిలోనికి రానివ్వకుండ చేసేసింది.

మరో నాల్గురోజులు దొర్లిపోయాయి. జ్వరం తీవ్రరూపం దాల్చింది. టెంపరేచర్ 105° పైగా వుంది. వెంకట్రావు పూర్తిగా నీరసించిపోయాడు.

"మోహినీ ! నన్ను బ్రతకనివ్వదలచుకోలేదా ?

ఆ మందు గ్లాసులోపోసియివ్వు." ప్రతిమాలు కున్నాడు. జాలిగా ప్రాధేయపడ్డాడు.

"నేనేమి మీ దాసీదాన్నికాదు." విసుగ్గా సమాధానం చెప్పేసరికి, నిప్పుమీద నూనెజల్లినట్లయిం దతనికి.

"అవును. నీవు నా దాసీదానవుకాదు. మహారాణివి. డబ్బున్నంతకాలం నీవు నాకు దాసీదానవు. నేను లేవలేని స్థితిలోవుంటే నీవు మహారాణివి."

"మీతో మాటలుపడటానికి నేనిచ్చటకు రాలేదు."

"నా ప్రాణాలు తీయడానికి వచ్చావు. పండులాంటి సంసారాన్ని నట్టేట్లో కలపడానికి వచ్చావు. అమాయకురాలు, అబల, అనాధ అయిన ఒక స్త్రీ మాంగల్యాన్ని మంటకలపడానికి వచ్చావు. పవిత్రురాలైన ధర్మసీల, న్యాయమూర్తి, కరుణామయి ఒక స్త్రీ చేతులోని గాజులను పగులకొట్టి, నుదిటి కుంకుమను చెరపి, హృదయంమీద కదులుతున్న మంగళసూత్రాన్ని తెంచడానికి వచ్చావు."

మోహిని ఆగ్రహంతో లేచి, అతని చంపమీద ఒక్కటి చరిచేసరికి, కమల పరిగెత్తుకొని అచ్చటకు వచ్చింది. మోహిని జుట్టుపట్టుకొని, రెండు దవడల మీద దభాదభా బాదింది. ఆమెకు వళ్లు తెలియ లేదు.

"ఇంతటితో నిన్ను వదలిపెడుతున్నాను. ఇంతవరకు నా భర్తను ఎంత అగౌరవపరచినా సహించాను. నన్ను అవమానిస్తున్నా, నీకు సేవచేయడానికికూడ అంగీకరించి మళ్ళా యిచ్చటకు వచ్చాను. ఇహ సహించలేను. నా భర్తమీద నీవు చేయిచేసుకోడానికి అధికారం ఎవరు యిచ్చారు. నీకు హృదయముందా? నీదసలు స్త్రీ జన్మేనా! జబ్బుతో లేవలేనిస్థితిలో వారుంటే, హృదయంమీద దెబ్బ కొడతావా? ఇంకా చూస్తావేం! వెళ్లు! ఆ దేవుడ్ని ప్రార్థించు. నిన్ను క్షమించమని నా భర్త కోరుకుంటారు."

మోహిని తన బిచాణా తీసుకొని బయలుదేర బోయింది.

"ఇటుచూడు. నా జీవితాన్ని నాశనంచేయ దలచుకొని యిచ్చటకు వచ్చావు. నా భర్త ప్రాణాలనుకూడ తీసుకోడానికి ఎంత మాత్రం వెనుదీయ లేదు. ఇహనుంచైనా బుద్ధితెచ్చుకొని, ధర్మాన్ని చూడు. ఎవరి సంసారాల్లో దూరకుండా, మంచిగా బ్రతుకు."

కమల మాటలు మోహిని విన్పించుకోలేదు. మళ్లా వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోబోయింది. కమల వీధిగుమ్మందగ్గరకువచ్చి, మోహినిని పిల్చింది.

"ఆవేశంతో ఏమో అనేశాను. క్షమించు మోహినీ. నా భర్త నీ వలనే మంచివారయ్యారు. నీ దుర్మార్గం వారి వంటిలో బాగా పనిచేసింది. వార్ని నాకప్పగించి వెళ్తున్నందుకు సంతోషిస్తున్నాను."

వీధితలుపులువేసి, లోపలకు వచ్చింది.

"కమలా! నన్ను క్షమించు." వెంకట్రావు రెండు చేతులతో ముఖం కప్పుకొని, చంటిపిల్లవాడి లాగ యేడ్వడం మొదలుపెట్టాడు.

"అందర్నీ క్షమించేది ఆ భగవంతుడు. మీరేమి అధైర్యపడకండి. జ్వరం తగ్గిపోతుంది" కమల మంచంమీద కూర్చుని, అతని తలను తన వొడిలో పెట్టుకొని, వ్రేళ్ళతో తలను నిమురుతూ సముదాయించింది.

వెంకట్రావుకాజ్వరం డబుల్ టైఫాయిడ్ లోనికి దించినా, అహర్నిశాలు చేస్తున్న కమల శుష్రూష వల్ల బ్రతకగల్గాడు. ఇప్పుడు వెంకట్రావుని మంచి వారుగా కమల చూడగల్గుతుంది.

తన భార్య మామూలుభార్యకాదని, ఎంత దుర్మార్గుడైనా సన్మార్గునిగా చేస్తుందని, ఎంత జబ్బుచేసినా చావురాకుండా కాపాడుతుందని, పూర్వపు వెంకట్రావులాంటివాళ్లు ఎవరైనా జీవితంలో తటస్థించితే, వాళ్లకు పాఠం నేర్పుకుంటాడు వెంకట్రావు.

"ఇదంతా తన భార్య సుఖంకోసమే!" అని.

# "స్త్రీ"

"శోభశ్రీ"



"ఆ అనురాధ ఆనాడే అంతరించింది"

"లేదు.... నారత్నాలరాశి, అందాల అనూ అంతరించలేదు, చిలకలా కులుకుతూ, నెమిలిలా పురివిప్పి నేత్రాలు జీగేల్ మనేలా నృత్యం చేస్తోంది నా ఎదుట!"

"కాదు ... మీ ఎదుట దీనాతిదీనమై అలవరచుకొన్న తప్పిదాన్ని అంత మొందించమంటోంది ..."

"అహాఁ . ?"

"అవును !!"

"అనూ! .. ఏదో క్రొత్తగా మాట్లాడుతున్నట్లున్నావు ... నా అనూ నేను చెప్పినట్లల్లా చేస్తుందని అందరి ఎదుట గర్వంతో చెప్పుకొంటున్నాను ... ఆ విషయంలో నన్ను చూచి ఈర్ష్య పడనివారు లేరు ... నీ అందం, ఆ చిరునవ్వులో మెదిలే సోయగం .. గలనీవు నాభార్యవవ్వటం.... నీవు నోచిననోములు ఫలించాయి ... నా ఆశలు అత్యుత్తమ స్థాయిని చుంబించాయి ... ఇతరుల కళ్ళల్లో ఎర్రచారలు స్థానమేర్పరుచుకున్నాయి..."

"అవును! ... అందుకే గాబోలు నేను అధఃపాతాళానికి అదిమి వేయబడుతున్నాను ..

"లేదు ... కైలాస పర్వతానికెత్తబడుతున్నావు .. నీ ముందు ఆ పార్వతి .."

"మీ అపవిత్రమైన నోటితో దయామయిని ఉచ్ఛరించబోకండి!"

"అవును ... అనూ .. అను ... నా నోరు అపవిత్రమైంది ఆ భగవంతుడే నాశరీరాన్ని సహస్రవ్రక్కలయ్యేలా శాపమియ్యలేదు ..."

"ఇచ్చినా బాగనేవుండేది!!"

"ఊఁ.... ఏమన్నావు . నేను సహస్రవ్రక్కలవ్వాలని నీవే ఆశిస్తున్నావన్నమాట ... నీవొక స్త్రీవేనా ... కాదు, కాదు!! నీవొక నరరూపరాక్షసివి-మాయా భయంకరపిశాచివి .. విషకుంభానివి ... చూస్తాను ... నీశరీరంలోని రక్తాన్ని బొట్లుబొట్లుగారాల్పిస్తాను. ... బయల్దేరు ఊఁ .. నా స్నేహితులు మనకోసరం ఎదురు చూస్తుంటారు ఆక్లబ్బులో నేనులేక పోతే ..."

"నేనురాలేను..."

"రావాలి ..."

"రాలేను . అక్కడికొచ్చి కనబడ్డ మొగాణ్ణల్లా పండ్లికిలిస్తూ పలకరించలేను ..."

"ఇన్నాళ్లు నీవాపని నేలా చేయగలి గావు?"

"మీరు నాకు మసకద్దాలు పెట్టి చీకటి తెరలతో మూశారు. అవి ఇప్పుడిప్పుడే విచ్చుకొని, వెలుతురిని నింపుకుంటు న్నాయి!"

"ఆ చీకటి తెరలు నీ జన్మలో తొలగవు— తొలగనీయను."

"తొలగించగలను తొలగించి నా నారీధర్మాన్ని ఋజువు పరుచుకుంటాను ...

"ఋజువు .. పెద్ద పెద్ద మాటలను నేర్చావే .. అందరు చేసుకోలేక నే నా కాలంగడుపు తున్నారు...వాళ్లు ఆ సంతో షంలో సంతోషాన్ని అర్థం చేసు కొన్నారు .... కాబట్టే ఆ పరిసరాలను వదిలిపెట్టకుండా జీవితాలను ధన్యపరచు కుంటున్నారు ...."

"జీవితాలను అర్థాన్న పరచుకుంటు న్నారు."

"అది నీ ఊహలో — పద నన్ను విసిగించక, ఆ కొత్తగా తెచ్చిన చీరెను కట్టుకొని, హంసలా అందాన్ని చిందిస్తూ బయిల్దేరు ..."

"నేను రాను—రాను—ఆ ఉల్లిపొరలాంటి చీరను శింగారించుకొని రోడ్డుమీద వింత జంతువులా నడవలేను! అలా రావటం మా స్త్రీ జాతికే కళంకం — గొడ్డలిపెట్టు — ఏ భారత యువతి దానినాశించదు... విదేశీ అనుసరణీయులు తప్ప ... వారికిక వచ్చేజన్మలో పుట్టగతులుండవు .. పాపం శమించుగాక! ఇదివరకు నేను చేసిన తప్పిదానికి క్షమించమని భగవంతుని ప్రార్థిస్తున్నాను ..."

"క్షమిస్తాడు ... భర్త నెదిరించిన భార్యను క్షమిస్తాడు? మోక్షం చేకూరు స్తాడు? — "నీవేలాగై నాచావు — నాక్కావాల్సిందల్లా నీవా చీరకట్టుకొని క్లబ్బుకు రావాలి ... నాస్నేహితులంతా మనకోసం ముఖ్యంగా ని అందాన్ని చూడా లని ఆశతో చూస్తుంటారు ... వారి భార్యలు నిన్ను చూచినవెంటనే చంద్రుని యెదుట తారకలవలె మొఖాలు వేలాడేస్తూ ఈర్ష్యతో .. సిగ్గుతో — నావంక, నీ వంక చూస్తారు ... పద ఈ రోజునుండి క్లబ్బుకి రాణివి నీవు ... రాజుని—??"

"ఎన్నటికి కాదు! వింత అడవిమృగంతో నేను సంచరించలేను ."

"ఒహో . పవిత్రమూర్తివి, ఏక పత్నీవ్రతురాలివి గదూ?" అతని హృద యం అద్దంలాంటిది గాబోలు!!"

"తప్పకుండా. మీారెన్నన్నా సహిస్తాను; చంపినా సుఖంగా జీవితాన్ని సమర్పిస్తాను... కాని ఆ ప్రదేశానికొచ్చి నాశీలాన్ని కలు షితం చేసుకోలేను; మానానికి మలినం

చేకూర్చలేను. రాలేను క్షమించండి !'' గిరుక్కున వెనక్కు తిరిగి గదిలోకి పోయింది.

వదలలేదు భర్త ... పెట్టిన యమ యాతనలను సంతోషంతో సహించింది... కాని అతని కోరికను నెరవేర్చలేదు.

కాసిదిపరకు భర్త చెప్పినట్లల్లా తిరిగి పరాయి పురుషులతో చేతులు చేతులు కలిపి, పండ్లికిలించినమాట నిజమే' కాని ఇప్పుడు కళ్ళు లేని కళ్ళు ప్రపంచపు పోకడను అవగాహన చేసుకుంది ... తనకోసం ఎంత మంది తాపత్రయ పడేది తెలుసుకుంది .... భారత దేశంలోని స్త్రీకి గల ప్రాధాన్యతను గుర్తించింది. స్మరించింది స్వగతంలోనే.

''చేతిలోనున్నది చూచావా ?''

''చూచాను ... కత్తి ... నాకు మోక్షాన్ని ప్రసాదించే దేవత .. చిరు నవ్వుతో కౌగిలించుకోమని మనసారా ప్రార్థిస్తున్నాను !''

''ఆఁ .... అలాకాదు .... నీదిబండ బారిన మొండిగుండె. అన్నం నీళ్లు లేకుండా ఈ గదిలోనే పడిచావు !'' తలుపుతాళం వేసి కోపంతో వెళ్ళిపోయాడు.

అనూరాధ కళ్ళు కాయలు కాచాయి... హృదయం బొబ్బలెక్కింది. మనస్సులోని గాయం మరింత రక్తాన్ని బయటకు చిమ్మింది.

♦ ♦ ♦

మూడు రోజుల తరువాత మధ్యపానపు మత్తుతో తిరిగివచ్చిన అనురాధ భర్తకు — అనూరాధ ఆ గదిలోనే ఉరిపోసుకు మరణించినదని తెలిసిన తరువాత ... కళ్లు తెరిపిళ్లు పడ్డాయి.

''నిజంగా మొదటి అనూరాధ మరణించిందన్నడో! ఇప్పుడు తన అప్రియమైన రెండవ అనూరాధ గూడ అంతరించింది!'' పిచ్చివాడిలా రోడ్లమీద తిరుగుతూ ఏడ్వసాగాడు.

♦ ♦ ♦

ఆ గృహంలో నిలువెత్తు కృష్ణదేవుడి పఠానికేసిన చేమంతి పూలదండనుండీ రెండు రేకలు గాలికి ఊడి ఎక్కడికో కొట్టుకుపోయాయి.

---

# పునర్వసంతం

శ్రీ "భగవత్కుమార"



"రఘూ! ఇల్లారా!" అంటూ కేకవేసింది సుజాత.

"ఏమిటక్కా" అంటూ వచ్చాడు రఘు.

"పుస్తకాలు తెచ్చుకో పాఠంచెపుతాను."

రఘు పుస్తకాలు తెచ్చుకున్నాడు తమ్ముణ్ణి దగ్గర కూర్చోబెట్టుకొని పాఠం చెపుతోంది. అయితే రఘు మనస్సు పాఠంపైలేదు. నిద్రతూలివస్తూండటం చేత కునుకిపాట్లుపడుతున్నాడు. ఐతే సుజాత మనస్సు కూడా సరిగ్గాలేదు. మనస్సు గతించిన సంఘటనల్లోకి పురకలువేస్తూంది. గతస్మృతులను నెమరువేసుకోకుండా వుందామని ఎంత ప్రయత్నించినా మనసు మాత్రం దాగని అగాధాల్లోకి పరుగులిడుతూ విపరీతమయిన దుఃఖానికి గురిచేస్తూంది. దుఃఖాన్ని అరికట్టటానికి ప్రయత్నించీ విఫలురాలయింది. అంతటితో తమ్ముడిపాఠం కట్టిపెట్టింది. ఆ బయట వెన్నెలలో మంచంమీదపడుకుంది. ఎంత ప్రయత్నించినా కన్నీళ్లను అరికట్టలేకపోయింది.

సుజాత రఘులు కృష్ణమూర్తిగారి సంతానం. ఆయనది ఏమంత కలిగిన కుటుంబం కాదు. భార్య సుందరమ్మ సుస్వభావంకలది. వాళ్లకు మొట్టమొదటగా సుజాత కలిగింది. ఆ తరువాత చాలా కాలానికి రఘు పుట్టేడు. సుజాత పెద్దమనిషియైన దగ్గర్నుంచీ కృష్ణమూర్తికి కాలాగటంలేదు. ఇక సుందరమ్మ ఆదుర్దా చెప్పనవసరంలేదు. వెనకటికి ఒక సామెత వుంది - ఏడుజోళ్లు అరిగితేనేకాని ఒక మనువు కుదరటం కష్టమని. అందులోనూ మధ్య తరగతి కుటుంబీకునికి అందుబాటులోవుండే సంబంధం కుదరటం కష్టమైనపని. ఎలాగో తిరిగి తిరిగి ఒక సంబంధం ఖాయమనుకొని వచ్చాడు కృష్ణమూర్తి.

వరుడు రామారావు. బి. ఏ. చదువుతున్నాడు బరువుకట్నమయినా విధిలేక ఒప్పుకున్నాడు. పరిస్థితులన్నీ సవ్యంగా వుండటంవల్ల నిరాటంకంగా పెండ్లిజరిగింది. అయితే పెండ్లిలోనే కార్యంకూడా చేసి బరువు వదిలించుకుందామని అనుకుంది సుందరమ్మ. కాని రామారావు బి. ఏ. పరీక్ష అయిందాకా కార్యంచేసుకోనని పట్టుపట్టటంవల్ల ఎవరూ ఏమీ అనలేకపోయారు. పరీక్ష అయిపోగానే ముహూర్తం ఏర్పాటుచేసుకున్నారు. కాని పెండ్లికొడుకు ఎందుకో ఆనాడు రాలేదు. అందరూ ఆశ్చర్యపోయారు. ఇంతలో పిడుగులా టెలిగ్రాం వచ్చిపడింది. రామారావు రిక్షాలో స్టేషనుకు వెడుతూండగా ఒక లారీ గుద్దుకుని ఆ యాక్సిడెంటులో మరణించాడని. భయంకరమయిన యీ టెలిగ్రాంతో కళకళలాడే ఇల్లంతా కళావిహీనమయింది. ఏడుపులూ, పెడబొబ్బలూ ప్రారంభమయినయ్. "అయ్యో! నాతల్లీ! నీకిదేంరాతే" అని సుందరమ్మ కూతుర్ని కౌగలించుకొని గుండెలు పగిలేలా ఏడ్చింది. చిన్నతనంలోనే ఇంకా నిండా పద్దెనిమిది సంవత్సరాలయినా నిండని కూతురికి ప్రాప్తించిన వైధవ్యాన్ని తలచుకుని రోదించాడు కృష్ణమూర్తి. ఇక సుజాత సంతాపం చెప్పశక్యంకాదు. గంపెడు దుఃఖంతో కూలబడింది. ఆశించిన తీయని ఘడియలు, అనుభవించబోయే అమరసౌఖ్యమూ, అన్నీ తృటిలో కలలుగా మారిపోయినయ్. మధువును గ్రోలబోయే మధుపం నోటిలో మన్నుపడింది. సుజాత భవిష్యత్తు అంతా చీకటిగా మారిపోయింది. చివరకు ఆమెకు మిగిలింది గంపెడు దుఃఖం, కడివెడు కన్నీళ్లూనూ - ఆనాటినుంచే సుజాత జీవితం అంధకారంలో అడుగుపెట్టింది. క్షణక్షణానికీ

కన్నీళ్ళతో కుమిలిపోయేది. బ్రతికినన్నాళ్లూ యిలా కన్నీటి సౌఖ్యమేనా అని కుమిలిపోయేది. కాని సుజాత అలాయని వూరుకోలేదు. తానూ స్కూల్ ఫైనలు ప్యాసయింది. అందుకని ప్రయత్నించి స్వస్థలంలోనే ఒక ఆఫీసులో క్లర్కుగా జేరింది ఇల్లా అని లోకులు కాకులయి కూయకపోలేదు. సుజాత చదువుకున్నది కాబట్టి అన్నిటినీ తృణీకరించింది. ఎవరయినా అమ్మలక్కలు మాటవరుసకు అన్నా, ఘాటుగా మందలించేది. ఇల్లాంటి సమయంలో కూతురు సుజాత సంపాదన చాలవరకు కుటుంబసహాయానికి అడ్డుపడింది. తన భవిష్యత్తు ఎలా అయిపోయినా రఘుకు పెద్ద చదువు చెప్పించవలెనని అనుకుంది. ఐతే సుందరమ్మ కూతురి భవిష్యత్తును గురించి ఎప్పుడూ ఆలోచించేది. ఆ మనోవ్యాధే ముదిరి చివరికి కన్నీళ్ళతో ఇహలోకం వీడింది- ఇది గోరుచుట్టుపై రోకలి పోటయింది కుటుంబానికి. అన్ని పనులూ సుజాతపైపడినయ్.

సుజాత గతస్మృతులలోనుండి బయటకు వచ్చేసరికి కన్నీళ్ళతో దిండు ముద్దయిపోయింది. చల్లని వెన్నెల, ప్రశాంతమయిన పూర్ణిమచంద్రుడూ, చల్లని గాలీ ఆమె వూహాల్ని రెచ్చగొడుతున్నయ్.

సుజాత ఆఫీసులో పనిజేస్తున్నా ఎవరితోనూ మాట్లాడదు. అనుక్షణం ఆమె ముఖంలో విచారం ప్రస్ఫుటంగా కనిపిస్తోంది. నవ్వుతూ ఎవరితోనూ మాట్లాడి ఎరుగదు. కొందరు ఆమెకు గర్వం అన్నారు. ఇంకా కొంతమంది పెంకిమనిషి అన్నారు. ఎవరేమన్నా ఏమీ లక్ష్యపెట్టేది కాదు.

కాని ఆయాఫీసులో పనిచేసే మోహన్‌కు మాత్రం ఆమె ప్రవర్తనకు బలమయిన కారణం ఒకటి వుండితీరవలెననుకున్నాడు. ఎందుకు ఎప్పుడూ అలా విచారంగా వుంటుందో తెలుసుకోవలెనని ఎంత ప్రయత్నించినా అంతుపట్టలేదు. ఆమెనే అడిగి తెలుసుకోవలెననుకున్నాడు. అయితే సమయం చిక్కలేదు.

ఒకనాడు మోహన్ పార్కులో కూర్చున్నాడు ఏదో ఆలోచిస్తూ. ఇంతలో సుజాతకూడా పార్కులోకివచ్చి ఒక బెంచిమీద కూలబడింది శూన్యంలోకి జూస్తూ. మోహన్ ఆమెనుజూసి దగ్గరగావచ్చి "సుజాతగారూ!" అని పలుకరించాడు. ఆమె అదిరిపడింది. కాని వెంటనే అతన్నిచూసి "ఏమిటండీ!" అన్నది. "మిమ్మల్ని ఒక విషయం అడుగవలెననుకుంటున్నాను. అపార్థంజేసుకోకపోతే ..." అన్నాడు. "సగౌరవమయిన విషయాన్ని ఎప్పుడూ అపార్థంజేసుకోను" అంది.

"మిమ్మల్ని ఎప్పుడుచూసినా ఏదో విచారంగా కనపడతారు. అందుకు కారణమేమిటో తెలుసుకోవచ్చా?"

ఆమె ఒక వేడినిట్టూర్పు విడిచింది. పేలవంగా పొడినవ్వు నవ్వింది. "నా జీవితాన్ని గురించి తెలుసుకోవాలెనని మీ కెందుకింతశ్రమ?" అంది.

"తోటివారి కష్టసుఖాలు తెలుసుకోవటం తప్పు కాదుగా" అన్నాడు.

"నాదంతా ఒక విషాదగాథ." అని క్రితం జరిగిన విషయాలన్నీ పూసగ్రుచ్చినట్లు చెప్పింది. మోహన్ కళ్ళవెంట అప్రయత్నంగా భాష్పాలు రాలినయ్.

"అంతా అయిపోయింది నా బ్రతుకు అడివిగాచిన వెన్నెల అయిపోయింది. ఏదో జీవిస్తున్నా. మోడువారిన చెట్టులా"- అంది గద్గదికంగా.

"నిండా ఇరవై అయినా వెళ్ళని యీ లేత వయస్సులో మీకు యీ దుర్భరవైరాగ్యజీవితమా?" అన్నాడు.

"కాక ఏముంది? కదిలినా మెదిలినా సంఘం కస్సుమని లేనిపోని అపవాదులు అంటగడుతుంది. గౌరవంగా జీవించటానికి యీ కుళ్లు సంఘంలో నాబోటి! వితంతువులకు స్థానంలేదు. ఇంతే నా బ్రతుకు యిలా జీవితపర్యంతం తెల్లవారిపోవలసిందే -" అంది. ఆమె కంఠంలో ఎంత దుఃఖం మిళితమైవుందో, ఎన్ని కోర్కెలు అణగారిపోయి

నయో. అప్పటికి బాగా చీకటిపడింది. పార్కులో జనం దాదాపు సన్నగిల్లారు రేడియో మాత్రం వదలకుండా గీపెడుతూంది. మోహన్ ఏదో ఆలోచిస్తున్నాడు.

"మీకు అభ్యంతరం లేకపోతే నేను మిమ్మల్ని వివాహమాడతాను." అన్నాడు.

సుజాత ఉలిక్కిపడింది. పలచని పెదిమలపై పేలవంగానవ్వి - "నా జీవితాన్ని పరీక్ష చేస్తున్నారా" అంది.

"లేదు. నా జీవితాన్ని పరిశీలించుకునే యీ విషయం మీ ముందు పెట్టాను -" అన్నాడు.

"మోహన్ గారూ! యిదంతా ఒట్టిభ్రమ. ఇలా చేస్తే సంఘం మనమీద విరుచుకుపడదూ -" అంది.

"అదే పొరపాటు అంటాను - ఈ సంఘానికి కళ్లువుండి నిజాన్ని చూడలేదు - నేను సమాజాన్ని లెక్కచేయను. ఎప్పుడో ఆ హద్దులు దాటిపోయాను. మనం సమాజాన్ని వ్యతిరేకించినా చేసేది తప్పుపనికాదుగా. జీవితకాలం ఏడుస్తూ జీవించటం సంఘానికి బాగుంటుందా? అనుభవించటం, ఆనందించటం వ్యక్తికిచ్చిన స్వతంత్రం. సంఘసంస్కర్తలు వెలుగుబాటలోకి అడుగుపెట్టాలి. అప్పుడే భవిష్యత్తుకుదారి -" అన్నాడు.

"అలా అయితే నా జీవితంలో మళ్లీ వసంతం తొలకరించింది మోహన్. మా నాన్నను ఒప్పించటమంత కష్టమైనపనికాదు మోహన్ -" అంది.

ఐతే సుజాత యీ విషయాన్ని చెప్పేందుకు కొంచెం వెనకముందాడింది. పాతకాలపు తండ్రి యీ విషయానికి అనుమతిస్తాడా అని సంశయించింది. ఐతే మోహన్ యీ విషయములో ముందంజ వేశాడు. ఒకనాటి సాయంత్రం యీ విషయం కృష్ణమూర్తికి బయటపెట్టాడు.

ఆయన మొదట ఆశ్చర్యపోయాడు. తరువాత కూతురు భవిష్యత్తును నెమరు వేసుకుని తమాయించసాగాడు. చివరకు "సమాజాన్ని ఎదిరించి ముందుకు పోవటం కష్టమైనపని. ఇప్పటికే లోకపు కాకిగోల భరించలేకున్నాను." అన్నాడు బాధగా.

"అన్నీ తెలిసిన మీరుకూడా యిలా మాట్లాడితే ఎలా చెప్పండి. ఆ దుష్టసంఘపు అడ్డుగోడలను అధిగమించి ముందుకుపోవాలి. నీతిఅయినమాటకే మనం విలువయిస్తాము కాని అవినీతికి స్థానం ఇవ్వముగా. జీవితంలో నవ్వుతూ వుండాలి. అంతే కాని ఒకరికిదడిసి ఎంతకాలం ఒదిగివుంటాము -" అన్నాడు,

"మోహన్ నీవు సంఘ సంస్కారానికి మణిపూసవి" అన్నాడు కృష్ణమూర్తి ఆనందంతో

"అమ్మా సుజా ఇలారా!" అని కూతుర్ని పిలిచాడు.

సుజాతవచ్చింది. "నా తల్లి జీవితం ఇహ ఎప్పుడూ దుఃఖమిళితమే అనుకున్నాను. నీ జీవిత అంధకారంలో జ్యోతి వెలిగించాడమ్మా మోహన్. నా తల్లికి చల్లని రోజులు రావటమేగా నాకూ కావలసింది. కలకాలం నీ విలా వాడిపోయిన పూవులా జీవించటం నాకు మాత్రం శూలం పొడిచినట్లు వుంటుంది తల్లీ! తిరిగి నీవు ఒక యింటిదానివయ్యావు నా కదే పదివేలు తల్లీ! ఏదీ కుంకుమపెట్టుకొని రామ్మా!" అన్నాడు.

సుజాత క్రొత్తచీర కట్టుకొని బొట్టుపెట్టుకొని కళకళలాడుతూ తండ్రి దగ్గరకు వచ్చింది. "నా తల్లిని మళ్ళీ యిలా చూడగలిగాను. నీ జీవితంలో పునర్వసంతం తొలకరించాడు మోహన్!" అని ఆనంద భాష్పాలుగారుస్తూ కూతురు చేతిని మోహన్ చేతిలోవుంచి "కలకాలం సుఖంగా వుండండి!" అని దీవించాడు ఆ దంపతులను.

మోహన్ భార్యవైపుచూసి చిరునవ్వు నవ్వాడు. క్రొత్త పెళ్ళికూతురిలా సుజాత సిగ్గుపడింది. ఆనూతన దంపతుల మధుర జీవనంలో సంఘపు గోడలు నిలువలేక పునాదులతో కూలిపోయినయ్.

—o—

# పుష్ప శోకము

శ్రీ నిజామోహియుద్దీన్

—X—

శైశవంబున హాయిగ - 'జిరునగవుల
తోడఁ బవనము క్రీడించెః - తోషణమ్మ
నభ్ర మరములు జోలపా - డె; ప్రజనిక
ముదముననను జూచి మిగుల - మురియు
చుండె.

అక్కటా యెట్లువచ్చెనో - యపుడుగడుసు
యౌవ్వనంబు సొగసుతోడ - యముని
లాగు,
తుమ్మెదల్ నన్నుఁగోరసా - గె మెయి
మఱపు
చేత; చుంబనమ్ములనిచ్చె - చేవతోడ.

అనుభవించితినానాడు - యఘనమహార
హమ్ము; ఒయ్యారిమైభ్రమ - రమ్ము
లన్ వ
లచితి ; నాపొందుకై వచ్చి - లషితతుమ్మె
దల్ యొసగె సుఃఖమునపుడు - దనివిచేత.

ఇచ్చితిననసీటి - ఁనిచ్చితిఁగౌగలిం
తలనుఁనాదమఱచి, - దారపోసి
తిసొగసున్ భ్రమరము-ల సుకముకొరకు;
కో
ల్పోతి సొంపునిపుడు - లోలనైతి.

చేరరెవ్వరు నాదరి - చెలిమిఁగోరి
వగచు వారెట గలరునా వగనుఁజూచి,
పుడమిపై స్వార్థముల్ గోరు - పుష్ప
విహాము
లు పువులఁ జెఱచుచుండు ఁజె - లువముఁ
జూచి

విస్వసించ వలదు - విస్రంభహీన పు
ష్పంధయములఁజూచి; - పాడబంబు
నివ్వవలదు వలచి - యిందిందిరమ్ముల
సుకము కొరకుఁనధమ - సుమములార.

# ప్రతిజ్ఞ

O——X——O

యౌవ్వనంలో, చేసిన పాపాలన్నింటికీ, పశ్చాత్తాపబడి, రాబోయే జన్మ సుఖకరమయేందుకు, ప్రపంచంతో నాకేం పనని, పరిశుద్ధమైన ఆత్మలతో భగవంతుణ్ని ప్రార్థించడానికి, వృద్ధాప్యం వుండనే వుంది. రణజీత్ వయస్సులో చేసిన పాపాలకు మితిలేదు. దారిదోపిడి, గుంపులకు నాయకుడై, ఘోరాతి ఘోరాలు చేసాడు. ఎంతోమందిని ఖూనిసహితం చేసాడు. పసిబిడ్డల నపహరించాడు. ఆ రోజుల్లో ఉత్తర హిందూస్థానమంతటిలోనూ రణజీత్ పేరంటే, హడలు. ప్రజలమాటటుండ, ప్రభుత్వానికే సింహమయాడు. అతడెన్ని దుర్మార్గాలు చేసినా, అతన్ని పట్టడం, ఎవరిసాధ్యం కాలేదు.

మూడేండ్ల ముద్దు బిడ్డ అయిన, రామ్‌గోపాల్ కూతురు జ్యోతిని, రణజీత్ ఎత్తుకుపోయాడు. వేసవికాలంరాత్రి, అంతా చల్లగాలికోసం చెట్లక్రింద మంచాలు వేసుకుని పడుకున్నారు. తెల్లవారి చూసేసరికి, తల్లిప్రక్కలో జ్యోతి లేదు, విపరీతం! ఇక నాతల్లినోదార్చడాని కెవ్వరికీ సాహసం లేకపోయింది. కాపాలా కొరకు నియమించిన, సేవకులందరినీ దండించారు. ఏమిచేసిమాత్రం ఏం లాభం! ఆ చిన్న జ్యోతి జీవితంలో, ఆ కాళరాత్రి, అంతటి మార్పు రాదలచుకొనియున్నప్పుడు ... అల్లారుముద్దుగా పెంచుతున్న తన ఆశాలత, తెగిపోగానే, తట్టుకోలేక, ఏడ్చి ఏడ్చి, ఆతల్లి శాశ్వత శాంతిపొందింది ... ఇక పాపం రాంగోపాల్, ఎంతో డబ్బుఖర్చుపెట్టి, జ్యోతి జాడ, ఎక్కడైనా తెలియవస్తుందని ఆశించాడు. పోలీసువారికెంత డబ్బులంచమిచ్చినా బూడిదలో పోసినపన్నీరే అయింది. పాపం. చిన్నప్పటినుండీ దక్కాముక్కీలు తిన్నమనిషి రాంగోపాల్. తనభార్యకు వలెనే, నిశ్చింతగా ప్రాణం పొమ్మంటే పోతుందా! చేసిన ఖర్మంతా అనుభవించవద్దూ. వున్నట్టుండి ఆకాశరామన్న వుత్తరాలు రానారంభించాయి రాంగోపాల్‌కి. ఆగ్రాకి మధురకి మధ్య ఒకచిన్న పల్లెవుంది. ఆపల్లెలో, అదీ నొక అడవేనని చెప్పదగే ఒక చిన్నచిట్టడవివుంది. ఆ చిట్టడవిలో ఒక చెట్టుక్రింద, పదివేలరూపాయలు పెట్టించావో, మర్నాడు ఆదేస్థలమున జ్యోతిని వదలి పెట్టెదమని, రాసివుందా వుత్తరములో. పోలీసుల సహాయం అపేక్షించిన, బిడ్డకి తిలోదకాలొదులు కోవలసిందేనని హెచ్చరించారుకూడాను. ఈ దొంగల ముఠాకు కావలసిన డబ్బులాగడానికి ఇది మొదటిపద్ధతి. పాపం, వీరి ధనపిపాస కెంతమంది పసికూనలు బాహుకులగుచున్నారో!

చేయిగల్గిందేమీ లేక, పదివేలూతీసికొని వెళ్లి పెట్టివచ్చాడాచోట. ప్రాణంకన్న, డబ్బేతీపనే నేటుకిగూడా, ధనంకన్న, బిడ్డయే ముఖ్యమనిపించింది. చిన్నతనంలో చాలా కష్టాలనుభవించి, వ్యాపారంలోకి దిగి, లక్షలార్జించాడు. చక్కని చుక్క తారను, పెండ్లాడి, ముద్దుబిడ్డ జ్యోతిని కన్నాడు. అతని జీవితంలో కాలచక్రం, క్రమంగా తిరగక, అల్లల్లాడుతోంది. పట్టుమని పదేళ్లు సుఖంగా గడిపాడోలేదో అతనిపాలి ఆనందం కాస్తా అంతమైపోయింది. ఇకమిగిలిన జీవితశేషం కష్టపరంపరలకే!

డబ్బు పెట్టివచ్చినమర్నాడు గంపెడాశతో జ్యోతిని తెచ్చుకొందుకు బయలుదేరాడు. ఆ పాపసొత్తుకొని వచ్చుటకు, అతడన్నివిధాలా తయారయ్యాడు. బిడ్డకుకావలసిన వస్తువులన్నీ ఇంటివద్ద ముందే బద్రపరచి, తల్లిలేని బిడ్డనెట్లుసముదాయించగలనా!! అనే బాధతో ఆస్థలానికి చేరుకున్నాడు.

నిర్ణీత సమయందాటిపోయింది. అయినా, ఆశవదలక ఆ రోజంతా అక్కడే పడివున్నాడు. చీకటిపడింది. జ్యోతి రాగలదనే ఆశ ఇంక ఎంతమాత్రంలేకపోవుటచే తిరుగుముఖంపెట్టవలసివచ్చింది. ఇదేవిధంగా మరికొండుసార్లు ధనపిశాచులకు,

చేజేతులా ధనం అప్పగించాడు. జ్యోతిపైనుండే ప్రేమయే అతనిని వెర్రిగా చేస్తోంది. ఆర్జించిన ఆస్తంతా ఈవిధంగా అడుగంటి పోగా మనస్థిమితం లేక, వ్యాపారం సాగడంలేదు. తిరిగి తన పూర్వ స్థితికే తెచ్చి విడిచిందతని జీవితచక్రం. ఏకాకిత్వ నిర్ధనత్వం! కాని ఆ పదేళ్ళ క్రిందటిజీవితానికీ ఇప్పటికీ వ్యత్యాసంలేకపోలేదు. ఆశ అనే మహా ఆయుధంతో అప్పుడతను ఆగగల్గాడు. ఇక ఇప్పుడా ఆశగూడలేదు. భార్యాబిడ్డలవియోగం అతనిని పిచ్చివానిని చేసివిడిచింది.

రణజీతుకి ఇదొక గొప్పవిషయంగాదు. ఇటు వంటివెన్ని చేసాడో, ఎంతమంది తల్లిదండ్రుల్ని బాధ పెట్టాడో అతనికి చీమైనా కుట్టినట్లుండేది గాదు. కాని ఈ జ్యోతి జీవితమహాత్యం ఏమిటో గాని ఆపాపంటే అతనికే దయగల్గింది ఆమెని కన్న బిడ్డలా పెంచాడు. మానవసహజమైన తండ్రిప్రేమ, జ్యోతివశమయింది. ఇక అతని ముసలితనంలో జ్యోతి తప్ప ఎవరూ తనవారనేవారులేరు. అనుచరులంతా ఆశక్తుడైన అతన్ని వదలివెళ్ళిపోయారు. చివరకు ముసలి తనంలో అతని హృదయమే అతని పై తిరుగుబాటు చేయనారంభించింది. శాంతిఅనేదిలేక తాచేసినదుర్మార్గాలన్నీ తలంపునకు వస్తూంటే పశ్చాత్తాపంతో రోజులు గడుపుతున్నాడు ఆకీకారణ్యంలో వున్న అతని రహస్యగృహం ఒకముని కుటీరంగా మారింది. తన పాపాలను క్షమించి తన్నురక్షించమని రాత్రింబవలు భగవంతుణ్ని ప్రార్థిస్తున్నాడు. ఎన్నోదొంగతనాలుచేసి ఎంతమంది ప్రాణాల్నపహరించాడు. వాటినెలాగైనా మరచిపోగలడు గాని నిత్యము తనకళ్ళముందు పెరుగుచున్న జ్యోతి విషయం ఎలా మరపుకురాగలదు. ఆమెకిప్పుడు పదునారుసంవత్సరములు వచ్చినవి. ఆమెనుచూచినప్పుడల్లా అతను భయకంపితుడై పోతున్నాడు. అతని కళ్ళకు ఆమె ఆదిశక్తిఅయిన అంబికలా కనబడుతోంది. ఆమె భావిసమస్య అతనికి అయోమయంగావుంది. ప్రపంచాన్నంతటినీ మోసపుచ్చి ప్రభుత్వంకళ్ళు మూయగల్గాడుగాని తనను తాను ఒప్పించుకోలేక పోతున్నాడు. రణజీతు రాత్రింబవలు మనోవేదనతో క్రుంగిపోతున్న అతనికిఒక రాత్రి తల్లిప్రక్కలోనున్న పసికూననెత్తుకొని రావడం దారిలోఆ బిడ్డహృదయవిదారకమైన ఏడుపు. మాతృప్రేమచే జ్యోతితల్లిమరణం అన్నీకలవచ్చింది. అసలేమరువలేని తనబాధను ఈ కల మరీద్విగుణీకృతంచేసింది. జ్యోతితల్లి జ్యోతికై పడినబాధ ఆకలలో చూసి అతను హడలిపోయాడు సంసారం, తల్లిప్రేమా ఎరుగని అతని మొండిఆత్మగూడా ఆ బాధచూసి సహించలేకపోయింది. ఆత్మహత్య తప్ప వేరు శరణ్యంఅతనికి గాన్పించలేదు. కాని అదిగూడ అంతసులభంగాదు. వయస్సులోవున్న జ్యోతిని వొంటిగా ఈ అరణ్యంలోవిడచి వెళ్ళిపోడం ఎలాగ? ప్రపంచం అంటే ఏమిటో తెలీదామెకి పాపం — ఆ అడవిలో ఒక అడవి మృగంలాగే పెరిగింది. మానవ సహజమైన లక్షణాలన్నీ ఆమెకపురూపమే. తన బాబా రణజీతుని దప్ప వేరేమీ ఎరుగదామె. ఆ అడవి ఆచిన్న పాక చుట్టువున్న పొదరిళ్ళు మృగములూ, పక్షులూ, అవే ఆమెప్రపంచం. అటువంటి ఆమెను వొంటరిగావదలి వెళ్ళిపోడం ఎలాగ? అది మహాపాపంగాదూ? తనుజ్యోతికి రక్షకుడైవుండి ఇటువంటి పనినెలా చేయగలడు? ఆమెకేదైనా దారిచూపి మరీపోవాలి.

దీర్ఘంగా ఆలోచించి చివరకొక నిశ్చయానికి వచ్చాడు. ఇతరుల చేతుల్లో తమప్రాణాలు పోగూడదనే వీరులకి ఆత్మహత్యకవసరమయే మందులకేం లోటు!

నిద్రపోతున్న జ్యోతిని లేపి ఆమెను ప్రయాణానికి సిద్ధపడమన్నాడు. జ్యోతి, ఆశ్చర్యానికి మేరలేదు. ఆమెకు తనకుబంధువులెవరూ లేరని వేరెతావేదీలేదనీ బాగుగాతెలుసును. అయినా ఈ రాత్రివేళ ప్రయాణంఏమిటి? ఎక్కడికి అని ఆమె ఆశ్చర్యంతో స్తంభించిపోయి బాబావంక చూడసాగింది.

"జ్యోతీ! త్వరపడు-ఆలస్యం చెయ్యకు బంగారు తల్లివి నేనెలా చెబితే అలా వినడమే గాని, అడ్డుప్రశ్న లెప్పుడూ వెయ్యవుగాదూ! బంగారు తల్లివి పది నిముషాల్లో వెళ్ళిపోవాలి" అన్నాడదో మాదిరిగా (తన బాధంతా దిగమ్రింగుతూ).

"బాబా అయితే నేనేం చెయ్యాలి చెప్పు. నువ్వెలా చెబితే అలా చేస్తాను. ప్రయాణానికి సిద్ధపడడమంటే, ఎలాగో నాకు తెలీదు బాబా" అంది అమాయికంగా.

ఆమె అమాయికత్వానికి జాలిపడుతూ రణజీతు, ఆమె, తనతో తేవలసిన సామానులన్నిచెప్పి ఒక పెట్టెలో తనవద్ద మిగిలిన ద్రవ్యమంతా పెట్టి, జ్యోతిని తీసుకొని బయలుదేరాడు.

ఆ అడవినీ, ఆ ఇంటిని వదలివెళ్ళడం జ్యోతికి చాలా కష్టమనిపించింది. తల్లి ఒడినుండి తనను వేరు చేసినప్పుడుగూడ ఇంత బాధనుభవించలేదేమో! "బాబా తిరిగి ఇక్కడికి ఎప్పుడు వస్తాం" అని బాబా నడిగింది. "ఇక రామమ్మా" అని చెప్పిన అతని జవాబుకి అదిరిపోయింది. ఇక ఏమిమాట్లాడలేక వూరుకుంది.

రైలు ఆగ్రా స్టేషనులో ఆగింది. రణజీతుదిగి, సరాసరి పోలీసు స్టేషనుకి బండికట్టించాడు. వెళ్ళడమే తడవుగా అర్జంటుగా రావలసిందని పోలీసు అధికారికి ఫోను చేసాడు. 16 సం॥ల క్రితం నాటి-ఫైళ్ళు తిరగేయించి దోపిడి దొంగల నాయకుడైన రణజీతుపై ఫిర్యాదులను స్మరణకు తెచ్చాడు. ఆ ఫైళ్లలోవున్న రణజీవు ఫోటోకు ముసలివాడైన ఇప్పటి రూపమునకు పోలిక బాగా వున్నది. పోలీసు అధికారి నివ్వెరబోయి ఏమిచెయ్యాలో తెలీక ఖంగారుపడసాగాడు. రణజీతుకి నవ్వు వచ్చింది. "మీ సహాయుల్ని పిలచి సంకెళ్ళు వేయించి శిక్షిద్దామని ఆలోచిస్తున్నారు గాబోలు—భేష్, మీచాకచక్యం పోలీసు డిపార్టుమెంటుకంతకూ వన్నె తెస్తోంది ... ఈ రణజీతు మీచేత సంకెళ్లు వేయించుకుందుకు రాలేదు. నన్ను శిక్షించేందుకు మీరెవరు? మీరు నాకన్న ఏ విధంగానూ నయంగాదు. నేను దొంగతనాలు చేసాను. ఎంతమందినో బాధపెట్టాను. అంతా రహస్యంగానే!! నన్నంతా దొంగఅంటారు. నీచుడంటూరు. నిజమే ప్రపంచం నన్నలా అనడంలో నాకు మేలే చేస్తోంది. అందువల్లే నేను కళ్లుతెరవగల్గాను. మరి మీరో పెద్ద పోలీసువుద్యోగులనే పేరుతో చేసేవన్నీ దుర్మార్గాలే. పిల్లని వెతెకితామని మీరుమాత్రం రాంగోపాల్ డబ్బులాగలేదూ? కాని నా పేరుకే భయపడి ఆ ప్రయత్నంలో అడుగైనా కదల్పలేదు. మీరు చేసేదంతా అన్యాయమే అయినా గ్రుడ్డిప్రపంచం మిమ్మల్ని మరీ గుడ్డిగా చేస్తోంది. కాని ఆసర్వాత్మ దృష్టిలో మీరే నాకన్నా నీచులు. అటువంటి మీ చేతుల్లో నా అంతం వుంటుందని ఎప్పుడూ అనుకోకండి. నాశిక్ష నేనే విధించుకున్నాను. నాకీ ప్రపంచంలో నాలుగంటలు మాత్రమే వ్యవధివుంది. మీతో ఈ వృధా కాలక్షేపంతో నావిలువైన నాల్గుగంటలూ పాడు చేయవీలు కాదు. ఈ జ్యోతి తండ్రిఅయినా రాంగోపాల్ నిపిలిపించండి అతనితో ఎంతో మాట్లాడాలి" అని రణజీతు వెనుకకి పడిపోయాడు.

"ఈ జ్యోతి తండ్రి రాంగోపాల్" అనేమాట వినేసరికి జ్యోతికి ప్రాణం ఎగిరిపోయింది. ఈ పోలీసు స్టేషను చుట్టూ పోలీసులు రణజీతు యొక్క ఈ విపరీతచర్య ఆమెను తబ్బిబ్బుచేస్తున్నాయి. ఆమెకండ్లనే ఆమెనమ్మలేక నిశ్చేష్టురాలై ఏమికానున్నదోనని భయపడసాగింది. తన తండ్రి, రణజీతు కాదనీ రాంగోపాలనే అవ్యక్తవ్యక్తినీ ఆమెనమ్మలేకపోతోంది. ఆమెకంతా అయోమయమే!! ఇక ఈ భూమిపై నాల్గుగంటలు మాత్రమేచుట్టమైవుండు, రణజీతు కోర్కె ప్రకారం రామ్‌గోపాలుని అక్కడకి తీసుకొనివచ్చారు.

వణకుతున్న చేతితో రణజీతు రాంగోపాల్ చెయ్యిపట్టుకొని చెప్పసాగాడు. "అన్నా ... క్షమించు నిన్నుక్షమాపణ వేడి నీకాళ్ళపైబడి,

తరించడానికే ఇంతకి సాహసించి, ఇంతదూరం వచ్చాను. ఇకవ్యవధిలేదు. ఈ మూడుగంటలు నీతోగడపని" అని అకస్మాత్తుగా "జ్యోతీ, జ్యోతీ," అని బిగ్గరగా అరవసాగాడు. జ్యోతి మెల్లగావచ్చి బాబా వద్ద నిలచింది రాంగోపాలాపిల్లవైపువింతగా చూస్తున్నాడు. తనజ్యోత అద్దాలలోనిపసిపాపనే అతనిభావంగాని రూపవిలాసిని అగు నవజవ్వనియని, అతడూహించియుండలేకపోడంచేత జ్యోతి తన జ్యోతా అనేభావం అతనిలోరేగింది. అయినా పితృహృదయం ఆభావాన్నణచి జ్యోతిని చేర దీయప్రోత్సాహిస్తోంది. రణజీతు జ్యోతిచేతిని తండ్రికందిచ్చి తిరిగి చెప్పనారంభించాడు. "ఇదిగో నీజ్యోతి. ఈమెని తిరిగి నీకప్పగించి నాహృదయ భారంతగ్గించుకొని దేహయాత్రముగించదలిచాను... నాభారంతీరిపోయింది ... అన్నా? నువ్వీబిడ్డను ఒక సంవత్సరముమాత్రమె పెంచావు ... ఆ పసిపాపనే నీవెరుగుదువు నేను పదిహేనుసంవత్సరము లామెను పెంచి నీకన్న ఆప్తుడనయాను. కఠినుడనయిన నాలో ఈమె పితృప్రేమను నాటింది. అదే పెద్దదై పెరిగి నన్ను దహించేస్తోంది. నాపాపాన్ని పూర్తిగా దహించదలచుకుంది. నేను తండ్రినైనతర్వాత కన్న తండ్రివైన నువ్వు జ్యోతికొరకెంత పరితపించావో తెలుసుకొన్నాను. ఆ తల్లిపడినబాధ నాకు తగిలింది. నా పశ్చాత్తాపమె నాజీవితాన్నార్పేస్తోంది. ఇక విను ఈజ్యోతి ఒట్టి అమాయకురాలు. అడవిలో పెరగడంవల్ల ప్రపంచంతెలీదు. భయం భక్తి ఆశ నిరాశ మోసం దుఃఖం ఏమిఎరుగకుండానే ఈపద హారేళ్లూగడిపింది. ఇకసంఘంలోప్రవేసించబోతోంది. తండ్రికి కన్యపైనుండు బాధ్యత ఇంతటితో ముగి సింది. ఇక పెండ్లిచేసి అత్తవారింటికి పంపాలి. ఆ పవిత్ర కార్యం నావంటి దోపిడి దొంగకు సాధ్య మయినపనిగాదు. ఇక ఈ జ్యోతి బాధ్యతనీకప్పగించి ఆమెకు చేయవలసిన విధి చెయ్యకబోతే బిడ్డకు గూడా ద్రోహంచేసినవాడినవుతాను (తను తెచ్చిన ఖజానా పెట్టె రాంగోపాల్ కి అందిస్తూ) ఇదిగో నా డబ్బు — ఇదంతా జ్యోతిసొత్తు — దీనితో ఈమెకు తగినసంబంధం తెచ్చి ఒక ఇంటిదానిని చెయ్యి. సంఘంలో అవసరమైన మంచిచెడుగులన్నీముందు గానే నేర్పాలిసుమా !" అంటూ ఇంకా ఏమో చెప్పబోతూ గుండెదడ విపరీతంగా వుండడంచేత వెనుకకిపడిపోయాడు. కొద్దిసేపటికి 'జ్యోతీ, జ్యోతి,' అనిపలవరింపసాగాడు. రాంగోపాల్ జ్యోతిని రణ జీతు ఒడిలోకూర్చోబెట్టాడు. రణజీతుకి మెలకువ వచ్చింది జ్యోతిని చూసి కండ్లనీరుబెట్టుకొని ఆమె తలనిమురుతూ "అమ్మా క్షమించు ... నీకు వేరే ఏ యొక్క సంగతి చెప్పనక్కర లేదు ... నీకీసరికి, నీ బాబా నిజరూపం తెలిసిపోయింది. ఇక నీతండ్రితో వెళ్ళి సుఖంగావుండమ్మా" అంటూ కన్నుమూసే సాడు...

'బాబా ... బాబా...అంటూ, జ్యోతి అతనిపై బడి కడుపుబ్రద్దలయేటట్లు ఏడ్చింది

(సశేషము)

(88-వ పేజీ తరువాయి)

అయినను శ్రీసాయిబాబా తన భక్తులపట్ల యింత నిర్దయగా నుండుటకు కారణమేమో అర్థమగుటలేదు. ఆమెకు సంతానములేదు వయసు సుమారు 42 సంవత్సరములు. ఆమె తానింక బ్రతుకనేమోనని అధైర్యపడుచున్నది. దయయుంచి గురువారంనాడు తమ ధ్యాన సమయంలో మాకు రక్షణమార్గమేదో బాబానుండి తెలిసికొని మాకు తెలుప ప్రార్థన. బాబా విభూది ప్రసాదములను కూడ పంపవలెను.

మా యీ ప్రస్తుత ఆపదనుండి విముక్తి చెందుటకు మార్గమును తెలుపుచు, ప్రశాంతమైన జీవితమును గడుపుటకు మార్గమును సయితము ఆదేశించవలసినదిగా ప్రార్థించుచున్నాను.

◆ ◆ ◆

గాఢాంధకారమయిన జీవయాత్రను దినగండం, నూరేళ్ళాయుస్సుగా గడుపుతుండిన మేము మీ ద్వారా శ్రీసాయిబాబా కరుణాకటాక్షములకు పాత్రులమైనందుకు యావజ్జీవ పర్యంతము కృతజ్ఞులము. మా బిడ్డలకు, నాకు, నా భార్యకు జబ్బుచేసినప్పుడు అనేకసార్లు తమ చేతి విభూది ప్రసాదములు, కరస్పర్శ స్వస్థత సమకూర్చినవి.

నడి సముద్రంలో మునిగిపోతున్నామని భయభ్రాంతులమయిన రోజులలో సయితము మీరు సమకూర్చిన మనశ్శాంతి, ఆత్మవిశ్వాసముల మరువలేము.

మా దైనిక జీవయాత్రలో మిమ్ములను, శ్రీ బాబాను స్మరించి, ఆరాధించి, మేము పొందుచున్న ఆత్మానందము వర్ణనాతీతము. మేము ఎప్పుడు బాబాను ప్రార్థించినా ప్రపంచమునకు శాంతి సౌభాగ్యములను ప్రసాదించవలసినదిగాను, కష్టాలకు, దుఃఖాలకు గురియగుచున్న మానవులందరితో బాటు మమ్ముల సయితం క్షమించి రక్షించవలసినదిగా ప్రార్థించుచుండెదము.

తామనుగ్రహించిన బాబా విభూదిపొట్లములు చాలకాలం కంటికిరెప్పవలె కాపాడినవి. కాని దురదృష్టవశాత్తున ఆ పొట్లములను జేబులోనుండి ఎవరో దొంగిలించారు. అప్పటినుండి కుటుంబంలో ఆర్థికంగా, ఆరోగ్యంగా, మానసికంగా నిలకడలేని వాతావరణము ఏర్పడినది. మేము బాబాపట్ల ఏదైనా అపచారము చేసినందువలన యిలా సంభవించినదనుకుంటున్నాము. మా మొరను బాబాకు నివేదించి మా కుటుంబంలోను స్థిరమైన శాంతి సౌభాగ్యములు నెలకొనునట్లును, దానధర్మాలకు, పారమార్థికచింతకు మాగృహము నిలయమగునట్లు అనుగ్రహించవలసినదిగా భక్త్యంజలి ఘటిస్తున్నాను.

(61–వ పేజీ తరువాయి)

పట్టణవాసి పేరు మాపుపొందెను. ఆ ముసలివాడు తన పరిశ్రమచే, నీటియందుగలుగు అలలు, చిత్రించుటలో, అవి కలుగచేయు ఛాయాచిత్ర వైగుణ్యములు, ప్రపంచమునకు చాటించిన, రాస్కిల్ అను సుప్రశిద్ధ చిత్రకారుడై కీర్తి నిలపిపోయెను. ఇట్టి ఫలాంశములనిచ్చు పరిశ్రమలు, మొదట యెట్టి ఆందోళణనలను చూపవు. ఒక బొంగరము వేగముగా తిరుగునపుడు, ఎట్టి అలజడియును చూపదు. ఆతీవ్రత తగ్గిన, తొట్రుపడుట కారంభించును ఒక యంత్రములో తిరుగుచక్రము కూడ అంతనే అట్టే పూర్ధ్వగమన జీవనముజరుగునపుడు పామర జీవితములలో జరుగు అలజడులు, వారిని ఏమాత్రమును చలింపజాలవు. తీవ్రకృషి చేయువారు సామాన్య కార్యములలో పాల్గొన సాధ్యములేదు. అందువలనవారిని పిచ్చివారని జెప్పజాలము. అటులనే తినుట, త్రాగుట, నిద్రించుట, పిల్లలను కనుటలో, ఎటి గొప్పదనము లేదు. తనునుగురించి విచారించుట, ఆశారాహిత్య దైవపదవిని పొందుటయందు, గొప్పదనమున్నదని గమనించు మహాపురుషులకు, అరణ్య జీవితము కడుసుఖముగాతోచును. అచ్చటవారు పరిపూర్ణపదవిని పొంది, తమ శిష్యులకు తమ ఫలములను పంచిపెట్టి పరమ పదవిని గాంచి యున్నారు వారిపనిని వారిశిష్యులు అందుకొని పూర్తి చేయుచున్నారు.

## శైలి మార్గము:-

ఉపనిషదులు మన అంతర పరిశోధనకు మార్గములు చూపుచున్నవి. ఇవి అనేక మహాపురుషుల తరములనుండీవచ్చిన తీవ్రకృషియొక్క ఫలితాంశములు. వారు కనుగొనినమానవజీవియే, శాశ్వతానందసత్యస్వరూపపరమాత్మ స్వరూపుడను, తీర్మానము భావకులోనైనదిగాదు. కానవారందుకు ఒక భావను సంస్కృతమను పేర సృష్టించి. భాషాతీత పరమాత్మ పదవిని, భావకులోనగునటులచేసిరి. కాని ఈ ఉపనిషదు మంత్రములు, వాటి భావతో పరమాత్మ పదవిని, భావకులోనగునటులచేసిరి. కానీ ఈ ఉపనిషదు మంత్రములు, వాటిభావతో పరమాత్మపదవిని తెలుపుటలేదు. వాటి భావయందుండు, భావములతో అనుమానసూచకముగా వెదజల్లుచున్నవి.

కనుకనే ఈ ఉపనిషదులందుగల మర్మమును, సత్యమును తెలుసుకొనవలెనన్న, సద్గురువుయొక్క బోధ ఆవశ్యకము. ఈ మంత్రములు, సిగ్గుతోను, అసూయతోను, మర్మగుణముతోను యున్నది. గనుక సులభముగా బయల్పడదు. అట్టి గురువును పొందుటయేగాక, మనలో నొక ప్రత్యేక తీవ్ర, విచారణా కాంక్షా శక్తి యుండవలయును. మన అంతరమును పరిశోధించుశక్తి కావలయును. ఈ శక్తి సంఘ వ్యక్తిగత, నీతిగుణములు పొందియుండి, తీవ్ర బ్రహ్మచర్యవ్రతము జరుపగలిగిననే పొందగలము.

## చివరకు

మంచిగానడుచుకొనుము. మంచి చేయుము. క్రమము తప్పక దినమునకొక యరగంటయైన ధ్యాననిమగ్నుడవుగమ్ము బ్రహ్మచర్యవ్రతమును తప్పవద్దు. ఉపనిషదుమంత్రములందలి సారమును గ్రహించుచు, దాని భావములను అనుభవింపుము. సర్వేశ్వరుని కృపాకటాక్షమువలన దాని భావములను గ్రహింపుము. సర్వేశ్వరుని కృపాకటాక్షమువలన ఆ పరమపదప్రాప్తి ఒక క్షణకాలమైనను మనమెల్లరము పొందగలుగుదుమన్న నమ్మకము, దృఢముగా చెప్పగలుగుచున్నాను ... ...



(64-వ పేజీ తరువాయి)
సరఫరా చేయడానికి ప్రభుత్వం అంగీకరించి, స్కీము పెట్టింది.

రెండో సత్యాగ్రహం గుంటూరు జిల్లాలో గుర్రం మల్లయ్య నాయకత్వాన సాగింది. 113 మంది అరెస్టు అయ్యారు. ప్రకాశంగారి మంత్రివర్గం వెంటనే దిగివచ్చి, వుపజ్ఞచూపి, చేనేత గుడ్డలమీద అమ్మకం పన్ను తీసివేసి, ఒక సంవత్సరం చేనేత పనివారలమీద మునిసిపల్ పన్నులు తగ్గించి, నిల్వ చేనేత గుడ్డల కొనుగోలుకు 25 లక్షల రూపాయలు కేటాయించటం జరిగింది. అక్కల కోటయ్య ప్రగడ కోటయ్య, జొన్నాదుల చలపతిరావు, బూదాటి యిందులో ప్రముఖపాత్ర వహించారు.

675 కో ఆపరేటివ్ ప్రయిమరీ సంఘాలున్నవి. రాష్ట్రి సంఘం బెజవాడలోవుంది. గుంతకల్లు చేనేత మిల్లు సోమప్ప వగైరాలకృషి ఫలితం, ఈ సంవత్సరారంభంనుంచి రాష్ట్రి సంఘం అజమాయిషీలోకి ఈ మిల్లులుగూడా వచ్చినై.

నిర్మాణ రంగంలో అట్లావుంటే, దేశవ్యాప్తంగా చేనేత కాంగ్రెస్ పనిచేస్తుంది. ఒకసారి కేంద్ర ప్రభుత్వం ఈసడించినా, రాజాజీ మొదలైన పెద్దల కృషివల్ల, సంఘబలంవల్ల కేంద్రంలొంగి, వారోత్సవాలకుగి, రిబేటుయివ్వ నారంభించింది. కేంద్రాలలోవున్న సామరస్యం రాష్ట్రి ప్రభుత్వాలలో లేదు ఆ విధానం మారాలి.

కావలసిన విధానం యేమిటి? డబ్బు పెట్టుబడులుకాదు, రిబేటుకాదు, కొన్ని రకాలైన చీరలు, దోవతులు మిల్లులు చేనేతమీద పోటీకిచేయకుండా ప్రత్యేకంగా చేనేతకు కేటాయించి, తతిమ్మా చిన్న పరిశ్రమలకేమి సహాయంచేస్తారో అట్లా చేస్తూ, వున్న నిల్వలను ప్రభుత్వం తీసుకుంటే చాలు. ఆదే వుద్యమంవారి కోరిక; దాని దగ్గరే ప్రభుత్వం తటపటాయించేది.

చేనేత వుద్యమంలో మరో విశిష్టతవుంది. ఎవరో పెద్దలుగాని, యేవో పార్టీలుగాని తెచ్చిపెట్టి నిర్మించిన వుద్యమం కాదిది. చేనేత పారిశ్రామికులే తమకు తాముగా నిర్మించుకున్న వుద్యమం. యిది నిజమైన స్వచ్ఛందమైన చేనేత పనివారల వుద్యమం. చేనేత శ్రామికులే తామే తమకుగా నిర్మించుకున్న వుద్యమం. అందుచేతనే నిండైన ప్రజాస్వామ్య వుద్యమం పారిశ్రామిక చేనేత సంఘాలు, జాతీయ చేనేత సంఘాలు, పుట్టినా, గిట్టడం తప్ప మరేమీ చేయలేకపోయినై. నిజమైన ప్రజాస్వామ్యం అప్రతిహతం గదా!

ఆంధ్రప్రదేశ్ రాగా కో ఆపరేటివ్ శాసనాలు మార్చి, ఐక్య చేనేత వుద్యమ లీనీకరణకు ప్రభుత్వము అచిరకాలంలో దోహదం చేయాలి. చేనేత కాంగ్రెసు వుద్యమం దానికి సహకరించాలి. ఆ స్థితికి యెదురుచూస్తూ, తడియారని హృదయంతో తమ కృషి చేయవలసిందిగా చేనేత వుద్యమ కార్యకర్తలను కోరుతున్నాను.

---

5 వ అఖిలభారత చేనేత సప్తాహసందర్భమున పశ్చిమ బెంగాలు, ఉత్తర ప్రదేష్, ఒరిస్సా, పంజాబ్ ముఖ్యమంత్రులు, ఇంఫాల్ చీఫ్ కమీషనరు శుభసందేశములను పంపుతూ కేంద్ర ప్రభుత్వము ఆలిండియా చేనేతబోర్డుద్వారా చేనేత పరిశ్రమాభివృద్ధికి చేయుచున్న సహాయమును పేర్కొనుచు గ్రామీణ ప్రాంతంలో నిరుద్యోగాన్ని తగ్గించి జాతీయ సౌభాగ్యమును పెంపుచేయగల చేనేతపరిశ్రమ ఉత్పత్తి విక్రయాలలో ఎదుర్కొంటున్న అవరోధములు, చిక్కులు తొలగుటకు ప్రభుత్వ సహాయంతోబాటు చేనేత వస్త్రముల ప్రజలు కొనుగోలుచేయుట పెరిగినచో పరిశ్రమ పరిస్థితులు మెరుగు కాగలవనియు, అనేక వేల మందికి జీవనోపాధిని కల్పిస్తున్న చేనేతపరిశ్రమ కలకాలము వర్ధిల్లి దేశదేశాలలో కీర్తి ప్రతిష్టలతోబాటు సహాయ సంపదలను ఆర్జించి పెట్టగలదని ఆశిస్తున్నామని వివరించిరి.

(63–వ పేజీ తరువాయి)

విద్యగా పరిగణించాలని రాష్ట్ర ప్రభుత్వానికి నేను విజ్ఞప్తి చేస్తున్నాను. కొత్త ప్రయిమరీ కోర్సు ప్రవేశపెట్టబడిన పాఠశాలలో లేదా, హైయర్ సెకండరీ పాఠశాలలలో ఒకటవ తరగతినుంచి ఏడవ తరగతి వరకు గల అన్ని తరగతులకు ప్రభుత్వం సహాయంగా పూర్తి గ్రాంటులను మంజూరు చేయాలని కోరుతున్నాను. బడికివెళ్లే వయస్సుగల పిల్లలందరికి మధ్యాహ్నపు భోజన సౌకర్యాలతో ప్రాథమిక పాఠశాలలను నిర్వహించడానికి కావలసిన నిధులను సమకూర్చుకోడానికి అదనపు విద్యా పన్నును విధించవచ్చును.

## ఆంధ్రుల కర్తవ్యం

"త్యాగరాయనగర్, సైదాపేట, కోడంబాకం తదితర ప్రాంతాలలో నివసిస్తున్న ఆంధ్రులు కేసరి మిడిల్‌స్కూల్‌ను హైస్కూల్‌గా అభివృద్ధి పరచడానికి విరివిగా విరాళాలు యిచ్చి తోడ్పడడంలో ముందంజ వేయాలని నేను కోరుతున్నాను. మన తెలుగు సంస్థకు అత్యంత ఉదారంగా విరాళాలు యిచ్చి తోడ్పడడానికి శ్రీ సి. ఎస్. లోకనాథ ముదలియార్. శ్రీ టి. ఏ. రంగాచారివంటి తమిళ ప్రముఖులు ముందుకురావడం గమనార్హం. కాబట్టి, త్యాగరాయ నగర్‌లోను, దానికి పరిసర ప్రాంతాలలోను నివసిస్తున్న తెలుగువారి పిల్లలకు ఉన్నత విద్యా సౌకర్యాలను కల్పించడానికి అందరు సహకరించాలని, ప్రత్యేకించి, చలనచిత్ర రంగంలో కళాకారులుగా, దర్శకులుగా, నిర్మాతలుగా, స్టుడియో అధిపతులుగా ధనాన్ని ఆర్జించిన ఆంధ్ర ప్రముఖులు మాకు తోడ్పడాలని నేను హృదయపూర్వకంగా విజ్ఞప్తి చేస్తున్నాను. శ్రీమతి భానుమతి శ్రీమతి అంజలిదేవిగార్లు పాఠశాలకు చెరొక 4,000 రూపాయలను విరాళంగా యిచ్చారు. అయితే, అందరూ ఆ విధంగా విరాళాలు యివ్వలేరని నాకు తెలుసు. కాని, ఈ సందర్భంలో నేను ఒక విషయం చెప్పదలచాను. శ్రీ అక్కినేని నాగేశ్వరరావుగారు పేద విద్యార్థుల సౌకర్యార్థం వినియోగించడానికి తాము పొదుపుచేసే సొమ్ములో కొంత భాగాన్ని యిస్తున్నారు. ఈ విధంగా ఆయన విద్యాసంస్థలకు ఉదారంగా విరాళాలు యిచ్చి తోడ్పడటానికి మంచి సంప్రదాయాన్ని నెలకొల్పారు. ఈ మార్గాన్ని ప్రఖ్యాత కళాకారులు అనుసరించగలరని నేను ఆశిస్తున్నాను. సినిమారంగంలో పనిచేస్తున్నవారి సమావేశాన్ని ఏర్పాటుచేసి, విరాళాలను వసూలు చేయడానికి ప్రయత్నించాలని శ్రీ నాగిరెడ్డి, శ్రీ చక్రపాణిగార్లవంటి ఉదార హృదయులకు నేను విజ్ఞప్తి చేస్తున్నాను. ఈ సందర్భంలోనే ప్రసిద్ధపారిశ్రామికవేత్త శ్రీ వి. రామకృష్ణగారిని కూడా మాతో సహకరించాలని నేను కోరుతున్నాను."

# మీకు తెలుసా?

మన దేశంలోగల 28 లక్షల మగ్గము లలో 23 లక్షలు రిజిస్టరు చేయబడినవి.

చేనేత మగ్గములు 1500 మిలియన్ల గజములగుడ్డను ఉత్పత్తి చేయుచున్నవి. అనగా మిల్లులు ఉత్పత్తిచేసే గుడ్డలో 3-వ వంతు.

అయిదు లక్షల సహకార సంఘములు 10 లక్షల మగ్గములతో చేనేతపరిశ్రమ నిర్వహించబడుతున్నది.

1952 తర్వాత చేనేత పరిశ్రమాభి వృద్ధికిగాను గ్రాంటుల రూపంగాను, అప్పుల రూపంగాను 22 కోట్ల రూపాయలకుపైగా ప్రభుత్వము ఖర్చు పెట్టింది.

చేనేతపరిశ్రమ భారీ ఎత్తున అభివృద్ధి యయినది భారతదేశంలోనే.

ఇండియన్ నూలుమిల్లులు సమకూర్చు నూలుకాక సహకార మిలులద్వారా చేనేతపరిశ్రమకు 'హ్యాంక్‌యార్న్' ప్రత్యేకించ బడినది.

చేనేతపరిశ్రమకు రంగు చీరలు, అంగుళం వెడల్పుగల అంచుధోవతులు, తుండుగుడ్డలు దుప్పట్లు లుంగీలు మేజా లపై పరచుగుడ్డలు, టరికి షీతుండ్లు చేతి రుమాళ్లు ఉత్పత్తికి ప్రత్యేకించబడినవి.

రెండవ పంచ ప్రణాళి కాంతమున యిప్పటి ఉత్పత్తికంటె 700 మిలియన్ గజముల చేనేతగుడ్డ పెరుగునట్లు నిర్దేశించ బడినది.

1450 సహకార విక్రయ సంఘాలలో 27 రాష్ట్రాల మధ్య విక్రయమునకు నిర్దే శించినవి.

గ్రామీణ ప్రాంతాలలో వస్త్ర విక్ర యానికి 36 సంచార మోటారువాన్‌లు వినియోగించబడుతున్నవి.

చేనేత వస్త్ర ఎగుమతులు ఏటేటా సుమారు 8 కోట్ల రూపాయల విదేశ మారకపు సౌకర్యాల సమకూర్చుచున్నది.

ప్రస్తుతపు సిలోన్, సింగపూర్, నైగీ రియా ఏడెన్. బాంగ్‌కాక్, రంగూన్ మార్కెట్టులతోబాటు పశ్చిమ జర్మనీ, అమెరికా, యితర పాశ్చాత్య దేశాలలో సయితము చేనేత వస్త్రముల విక్రయము నకు అవకాశములు ఏర్పడుచున్నవి.

రాష్ట్రాల మధ్య చేనేత వస్త్రముల విక్రయమునకు ఎగుమతులను ప్రోత్స హించుటకు చేనేత వస్త్రాల విక్రయ సంఘం స్థాపించబడింది.

చేనేత వస్త్రముల ఉత్పత్తి గత 7 సంవత్సరములలో రెండింతలు పెరిగినది.



# సంపాదకీయములు

## నీతి - అవినీతి

అవినీతికి పాల్పడిన ఉద్యోగులకు కఠిన శిక్షల విధించడమును కట్టుదిట్టం చేయుచు లోక్‌సభలో నొక బిల్లు ప్రతిపాదించబడినది.

అవినీతి, అక్రమం పెచ్చుపెరిగిపోతున్న యీ రోజులలో నైతిక పునరుద్ధరణ పట్ల ప్రజలు, జాతీయ నాయకత్వము మరింత ఆసక్తి చూపినచో యీ చట్టాలవలన సత్ఫలితములుండగలవు.

## శ్రీ బులుసు సాంబమూర్తిగారి నిర్యాణం

నిస్స్వార్థంగా, నిర్భయంగా ఆదర్శలక్ష్యముల సాధనకని పోరాడి, అఖండత్యాగములు చేసిన జాతీయ నాయకులలో శ్రీ సాంబమూర్తిగారొకరు

శ్రీ సాంబమూర్తిగారి ధైర్యస్థైర్యాలు జాతీయోద్యమగమనాన్ని ద్విగుణీకృతంచేసినవి. ఆంధ్ర రాష్ట్రోద్యమం సాంబమూర్తిగారి నాయకత్వముతో యీనాడు విశాలాంధ్ర నిర్మాణమును సాధించ కలిగిందనడం అతిశయోక్తి కాదు. మహిళాభ్యుదయముపట్ల వారుచూపిన ఆసక్తి చిరస్మరణీయమైనది. వారి నిర్యాణమువలన మనదేశం ఒక ఉత్తమ దేశభక్తుని కోల్పోయింది. వారి ఆత్మకు శాంతి సమకూరుగాక!

## నిరాహార దీక్షలు

గాంధీజీ అవలంభించిన నిరాహారదీక్షలను చూచి యీనాడు దేశంలో అక్కడక్కడ నిరాహార దీక్షలను పూనుచుండుటను గురించి వింటున్నాము.

తన ఆశయ లక్ష్యాలు సత్య, న్యాయ, ధర్మసమ్మతములైనప్పుడు వాని సాధనకు చిట్టచివరి మార్గంగా అనుసరించవలసినది నిరాహారదీక్ష. అంతేకాని సంకుచిత హృదయంతో, దురుద్దేశాలతో చీటికిమాటికి అవసరానవసరాలను గుర్తించకుండా జరిగే నిరాహారదీక్షలు జాతీయ శ్రేయస్సుకు వినియోగపడజాలవు.

## ధాన్యం ధరలను పెంచాలనడం సబబుకాదు

ప్రజలు, రైతులు పరస్పరసహకార సద్భావంతో సహజీవనం చేయవలసినవారు. రైతులు తక్కువ ధరలకు ధాన్యమమ్మి నష్టపడాలని ఎవరూ ఆశించుటలేదు. కాని రైతులమని చెప్పుకుంటున్న భూస్వాములు మాత్రం తృప్తిపడలేక అధికలాభాలకొరకని ధాన్యం ధరలు పెరగాలని ఆందోళన చేస్తున్నారు.

అశోక మెహతా కమిటీ సూచనలను అమలుపరచి అధికోత్పత్తికవసరమగు వసతులకొరకు ప్రభుత్వ సహాయసహకారములకు ఎందుకు ఆందోళన చేయరో దురూహ్యం.

రైతులూ బీదసాదలపట్ల సానుభూతి చూపక, ప్రభుత్వము ఆర్థికదుస్థితినుండి తప్పించ ప్రయత్నించకపోయినచో జీవితము దుర్భరము కాగలదు.



## శ్రీ హేవళంబినామ సం॥ర మాఘ, ఫాల్గుణ మాసములు

| | | | |
|---|---|---|---|
| | 16 | ఆ | త్ర 29 21 ఉషా 28-4 త్యా 4-15 మహాశివరాత్రి |
| | 17 | సో | చతు 31.46 శ్ర 32-33 త్యా 4-19 అమృతసిద్ధియోగం |
| | 18 | మం | ● అమా 35.9 ధ 37-14 త్యా 4-22 |
| | | | **ఫాల్గుణ మాసము** |
| ఫిబ్రవరి నెల | 19 | బు | శుపా 39-14 శత 42.36 |
| | 20 | గు | వి 43-53 పూభా 48 28 |
| | 21 | శు | త 48.43 ఉభా 54.32 త్యా 4-25 |
| | 22 | శ | చ 53.23 రే 60.10 త్యా 4.25 |
| | 23 | ఆ | పం 57-58 రే 0.28 |
| | 24 | సో | ష 60.10 అశ్వ 6.2 కుమారషష్ఠి |
| 1958 సం॥ | 25 | మం | ష 1-37 భ 10-58 |
| | 26 | బు | స 4.33 కృ 15.5 |
| | 27 | గు | అ 6-25 రో 18-10 |
| | 28 | శు | న 7-7 మృ 20 6 |
| | 1 | శ | ద 6-33 ఆర్ద్రా 20-48 |
| | 2 | ఆ | ఏ 4.45 పున 20.18 |
| | 3 | సో | ద్వా 1.44 ఏష్యం 56-7 పున 18.38 |
| | 4 | మం | చతు 52.53 ఆశ్రే 15-57 తిరువత్తియూరు పొగడమాను సేవ |
| | 5 | బు | ○ పౌ 46-53 మ 12.27 అహోబిల నరసింహస్వామి గరుడోత్సవము |
| | 6 | గు | కృపా 40.37 పూఫ 8.19 వసంతోత్సవం |
| | 7 | శు | వి 38-12 ఉఫ 3-50 హ 55-21 |
| మార్చి నెల | 8 | శ | త 27-52 చి 54.44 |
| | 9 | ఆ | చ 21.53 స్వా 50.47 తిథిద్వయం |
| | 10 | సో | పం 16-30 విశా 47.35 |
| | 11 | మం | ష 11.57 అనూ 57.19 |
| | 12 | బు | స 8 23 జ్యే 44 8 |
| 1958 సం॥ | 13 | గు | అ 5.57 మూ 44-9 త్యా 4-0 |
| | 14 | శు | న 4-46 పూషా 45.23 |
| | 15 | శ | ద 4.44 ఉషా 47.49 త్యా 4.10 |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.

